# ఆలోచనం

'నందిని' పత్రికలోని జీ.వి.యస్. సంపాదకీయాలు

మా **యువభారతి**

ప్రచురణల ప్రధాన సంపాదకులుగాను

అధ్యక్షులుగాను ఆత్మీయంగా వ్యవహరించిన

**ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం** గారి

(10.9.1935 - 15.8.2006)

దివ్యస్మృతికి సమర్పితం


ప్రచురణ




రిజిస్టర్డ్ నం. 1/64

**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ

ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు

తిలక్ రోడ్డు, హైదరాబాదు - 500 001

**ALOCHANAM**

Editorials of GVS from NANDINI Magazine



ప్రచురణ సంఖ్య-168

ప్రథమ ముద్రణ- మార్చి 2007

ప్రతులు-500

వెల : రూ.40

టైప్‌సెట్

సాక్షరతాభవన్ (లిటరసీహౌస్)

ఆంధ్ర మహిళాసభ, విద్యానగర్, హైదరాబాద్-500 007

ముద్రణ

విష్ణ కంప్యూటర్ సర్వీసెస్

(డిజైనర్స్ అండ్ ఆఫ్‌సెట్ మల్టీ కలర్ ప్రింటర్స్)

నల్లకుంట, హైదరాబాదు-500 044

ఫోన్: 27654003, 27676910

ప్రతులకు

**యువభారతి**

C/o ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు

తిలక్ రోడ్-హైదరాబాదు

# మా మాట

'చుట్టూరా ఆవరించుకుని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవటంకంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది' అన్న సూక్తితో ఊపిరిపోసుకుంది యువభారతి. తెలుగు ఎదలో తెలుగుదనం వెల్లువలాపారాలని, తెలుగింటిలో తెలుగు దీపం అఖండంగా వెలగాలని ఈ జాతి నిద్రలేచి మహోన్నత మానవాదర్శాలవైపు నిరంతర కృషితో పయనం సాగించాలనే ధ్యేయంతో ఉడుతాభక్తిగా కృషి చేస్తున్నది యువభారతి. భాషాభిమానం కలగాలంటే మాతృభాషాసాహిత్య పఠనమే ప్రథమకర్తవ్యం అనే భావం బలంగా మనసులో నాటుకోవడానికి గాను వీలైనంత ఎక్కువమందికి వీలైనంత తక్కువ వెలకు ఉత్తమ సాహిత్యం అందించేందుకు పూనుకున్నది యువభారతి.

1963 దసరానాడు ప్రాణం పోసుకున్న యువభారతి గత 43 సంవత్సరాలుగా అనేక సాహిత్య కార్యక్రమాలను నిర్వహించింది. 1965లో అనుములకృష్ణమూర్తిగారి 'సరస్వతీసాక్షాత్కారం' మొదలుకుని ఇప్పటివరకు 167 పుస్తకాలను ప్రచురించింది. అందులో సాహిత్య లహరులు, కవితా వైభవాలు, రచన, మహతి, యువతలాంటి వ్యాస సంపుటులు, కవితా సంపుటాలు, కథా సంపుటాలు ఉన్నాయి. గోష్ఠులు, సదస్సులు ఏర్పాటు చేసింది. నందిని పత్రికనడిపింది. అందులో ఆలోచనం, పరిశీలనం, ప్రభావం, పఠనీయం, నా ఊహా పథంలో అనేశీర్షికలతో అనేక విషయాలను పాఠకులకందించింది.

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు యువభారతి ప్రచురణలకు, 'నందిని' పత్రికకు చాలా కాలం ప్రధాన సంపాదకులుగానున్నారు. పది సంవత్సరాల పాటు యువభారతి అధ్యక్షులుగా వ్యవహరించారు. యువభారతి సాహితీరజతోత్సవాలను ఎంతో వైభవంగా నిర్వహించారు. యువభారతివేదికలపై ప్రసంగించారు. మా ప్రచురణలకు విపుల సంపాదకీయాలను సమకూర్చారు. యువభారతి సాహిత్యోద్యమంలో ప్రముఖ పాత్రపోషించారు. యువభారతి హృదయంలో చెరగని స్థానాన్ని సంపాదించారు.

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు తెలుగు సాహితీలోకంలో ప్రముఖ విమర్శకులుగా విద్యావేత్తగా, ఉత్తమ అధ్యాపకులుగా, నిరంతర సాహితీకృషీవలునిగా, పండితునిగా, కార్యకర్తగా, కావ్యకర్తగా, ఉపన్యాసకునిగా, సంపాదకునిగా, ఉస్మానియా విశ్వవిద్యాలయం అధ్యాపకునిగా,హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం ప్రాచార్యునిగా, డీన్‌గా, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపకులపతిగా, కేంద్రసాహిత్య అకాడమీ సభ్యులుగా, సలహాదారుగా, అనేక సాహిత్య సంస్థలకు ప్రధాన సలహాదారుగా వ్యవహరించారు. ప్రముఖ పత్రికలలో తన కలంతో 'కాలం' నిర్వహించారు. తెలుగు సాహిత్యలోకం మరవలేని మహామనీషి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు. యువభారతి నడిపిన 'నందిని' పత్రికలోని సంపాదకీయాలలో కొన్ని ఈ 'ఆలోచనం' వ్యాససంపుటి. ఈ వ్యాసాలన్నీ నిత్య సత్యాలు, నిత్య నూతనాలు, నిత్య పఠనీయాలు, నిత్య పరిశీలనాయోగ్యాలు, నిత్య ప్రభావితోపనీతాలు, నిత్యమూ మన ఊహాపథంలో మెదిలేవి. తన జీవితసాహిత్యాలను సార్థక్యం చేసుకున్న ధన్యజీవి జి.వి. సుబ్రహ్మణ్యంగారు.

మాడభూషి అనంతాచార్య
అధ్యక్షుడు, యువభారతి

# మా సుబ్రహ్మణ్యంగారి గురించి

"చిరునవ్వు వెలయెంత? సిరులేవీ కొనలేనంత!" అలానే, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారితో యువభారతికి ఉన్న ఆత్మీయత ఎంత? మాటల్లో చెప్పుకోలేనంత! ఋణభారం తీర్చుకోలేనంత! అయినా, ఈ సందర్భంలో కొంత అక్షరబద్ధం చేద్దామని చిన్న ప్రయత్నం.

ఆచార్య సుబ్రహ్మణ్యంగారు ఉన్నతస్థాయి నైపుణ్యాల అపూర్వ సమ్మేళనం. కలం పట్టినా, గళం విప్పినా, బాధ్యతలు చేపట్టినా, ముందు నిలిచినా... ఏం చేసినా అపూర్వ విజయాల్ని సాధించిపెట్టే అద్భుతసామర్థ్యం.

పదికాలాల పాటు గుర్తుండిపోయేలా యువభారతి కార్యక్రమాలను, ఉపన్యాస పరంపరలను, ప్రచురణ కార్యక్రమాన్ని రూపకల్పన స్థాయినుంచి విజయకేతనం దశ వరకూ తీర్చిదిద్దిన తీరు అనన్య సామాన్యం.

ఆయుగంలో శ్రీకృష్ణుడు "ఆహవం చెయ్యను. ఆయుధం పట్టను" అంటూ, విజయునికి పార్థసారధియై ధర్మవిజయానికి తోడ్పడటం జరిగింది. ఈ యుగంలో మా సుబ్రహ్మణ్యంగారు యువభారతి గౌరవసభ్యులుగా, ప్రధాన సంపాదకులుగా ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి తర్వాత పేర్కొనదగిన ప్రధాన వక్తగా, అవసరమేర్పడిన తరుణంలో కార్యరంగంలోకిదూకి సంస్థ అధ్యక్షులుగా సలహాలు చెప్పారు, స్వయంగా రంగంలోకి దూకారు. తెలుగు సాహితీలోకానికి యువభారతి సేవలను చిరస్మరణీయం చేశారు.

మా ఇరివెంటి కృష్ణమూర్తిగారిని విధి పిలిపించేసుకున్నతరుణంలో కొండంత అండగా కార్యభారాన్ని మోసిన విశాల హృదయం ఆచార్య సుబ్రహ్మణ్యంగారిది. హరి హరులవలె, వీరిద్దరూ మాకు రెండుకళ్ళు.

ఆచార్య సుబ్రహ్మణ్యంగారి గురించిన జ్ఞాపకాల దొంతరలను కదిలిస్తున్న ఈ తరుణంలో కనులలో నీరు తిరుగుతున్న ఈ వేళ వారి పనితీరుకు, వేగానికి ఒక్కోసారి తట్టుకోలేకపోయేవాళ్ళం- అనేక సందర్భాలు గుర్తుకు వస్తున్నాయి. ఒక్కటి మాత్రమే ప్రస్తావిస్తాను, "మహతి" అచ్చుపురుడు పోసుకున్నప్పుడు-శ్రీ సుబ్రహ్మణ్యంగారు ప్రెస్సులోనే మకాం పెట్టాల్సి వచ్చింది. వారు ప్రూఫులు దిద్దుతున్న దృశ్యం ఈ 35 ఏళ్ళ తర్వాత కూడా కళ్ళకు కట్టినట్టు కదలాడుతున్నది. కళ్ళు చెమర్చేలా చేస్తున్నది.

ఆచార్య శ్రీ సుబ్రహ్మణ్యంగారిని ప్రేమతో "పనిలో రాక్షసుడు" అని పిలుచుకునే వాళ్ళం ఆత్మీయంగా.

వారు లేరు. వారి జ్ఞాపకాలు మిగిలాయి. అజరామరమైన వారి కీర్తిలో యువభారతికి చిన్నస్థానం పదిలంగా వుంటుందన్న నమ్మకం మాకుంది. అదే, యువభారతి కీర్తిలో ఆచార్య సుబ్రహ్మణ్యంగారిది పెద్దస్థానం అని మనసారా విన్న విస్తున్నాం.

చంద్రునికో నూలుపోగు చందాన, మా యువభారతీయుల పక్షాన ఈ పుస్తకం సమర్పించు కుంటున్నాం.

**వంగపల్లి విశ్వనాథం**
సమావేశకర్త, యువభారతి

# "ఆలోచనం- అభ్యుదయం"

- డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

"వర్షించే మేఘజలం అభినవం
పుష్పించే మందారం అభినవం
తెలుగుతోట తిలకించిన జీ.వి.ఎస్
ఆలోచన కిరణంలా అభినవం"

మధురహృదయులూ మహావిమర్శకులూ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అప్పటి ఉపాధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికి 2002 లో నా 'వ్యాసోల్లాసం' గ్రంథాన్ని అంకితం చేస్తూ పలికిన పంక్తులివి. తెలుగు విమర్శలో వెలుగులు నింపిన ఆలోచక శిరోమణులు కీ॥శే॥ జీ.వి. సుబ్రహ్మణ్యాం, ఆయన కలం పట్టుకుంటే చాలు ఏదో ఒక కొత్తదనం మొలకెత్తవలసిందే. 'యువభారతి' సాహిత్య సాంస్కృతిక సంస్థ మహోజ్జ్వలంగా ఉద్యమించి తెలుగు సాహిత్య సేవ చేసిన కాలంలో 'నందిని' అనే పత్రిక నడిపింది. ఆ పత్రికలో 'ఆలోచనం' అనే శీర్షికతో అనేక విషయాలను గూర్చి సంక్షిప్తంగా చక్కని వ్యాసాలను ధారావాహికంగా వ్రాశారు - ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు. ఆ విధంగా ఆయన రచించిన ముప్పైఎనిమిది వ్యాసాలసంపుటి ఈ 'ఆలోచనం'. 'నందిని' పత్రికలో స్థలాభావంవల్ల వ్యాసాలు చాలా వరకు ఒకే పుటకు పరిమితమయ్యాయి. అయితే 7,8 పుటల దాకా సాగిన వ్యాసాలు కూడా కొన్ని ఉన్నాయి.

ఈ సంపుటిలోని వ్యాసాలలో వస్తు వైవిధ్యముంది. సంగీతం, సాహిత్యం, శాస్త్రం, కవిత్వం, కళలు, భక్తి, రక్తి, ముక్తి, అభినయం, విద్య, విశ్వవిద్యాలయాలు, పరిశోధన, ప్రణయం, పగ వంటి అంశాలను గూర్చి మహాకవుల మౌలికమైన ఆలోచనలు ఈ సంపుటిలో చోటుచేసుకున్నాయి. సూక్తిమాత్రంగా ఉన్న ఆలోచనలకు చక్కని సాహితీపరిమళవ్యాఖ్యలు ఇందులో దర్శనమిస్తాయి. ఒక చోట కాళిదాసు కవితోక్తుల కమనీయ వ్యాఖ్యానం కనిపిస్తుంది. మరో చోట తిక్కన పోతన శ్రీనాథాదుల వంటి ప్రాచీనాంధ్ర మహాకవుల పద్యాలకు పరమ రమణీయవినూతన వివరణలు మనలను పులకింపజేస్తాయి. ఇంకొకచోట, రాయప్రోలు, విశ్వనాథ, నండూరి, దాశరథి కుందుర్తి వంటి ఆధునికాంధ్ర మహాకవులు అందించిన కావ్యసూక్తులూ, వారి సాహిత్య సిద్ధాంతాలు సవ్యాఖ్యానంగా మన మనస్సులను అలరిస్తాయి. ప్రథమ, ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభా విశేషాలు కూడా కళ్లముందు కదలాడుతాయి.

డా॥ జి. వి. సుబ్రహ్మణ్య మహోదయుల సముదాత్తమైన సమున్నతమైన భావాలు ఈ రచనకు కావ్యమర్యాదను సంతరించి పెట్టాయి. తార్కాణానికి కొన్నింటిని పేర్కొంటాను.

"జాతికి అన్నంపెట్టడానికి హలాన్నిపట్టి కృషీవలుడు కృషిచేస్తుంటాడు. జ్ఞానభిక్ష పెట్టడానికి కలంపట్టి కృతికర్త కృషి చేస్తుంటాడు. వీరిద్దరూ జాతికి రెండు రెక్కలు" (శ్రేయస్సు).

'ఆలోచనం లోని కొన్ని వాక్యాలు సూక్తి మౌక్తికాలుగా మెరుస్తుంటాయి. మనలో ఆలోచనా తరంగాలను లేపుతుంటాయి.

"విస్తరిల్లటం వివేకలక్షణం" (విశాల విశ్వాంధ్ర)

"తిమిరం జడం, కాంతి చైతన్యం, ఒకటి మృత్యువు ఒకటి సృష్టి" (తిమిరంతో సమరం)

"రుచి అభిరుచి చేత ఆస్వాదింపబడుతుంది" (అందం - ఆనందం)

"కళ్ళు తెరుచుకుంటే కనపడేది బొమ్మ, కళ్లు మూసుకుంటె కనపడేది బ్రహ్మ" (బొమ్మ-బ్రహ్మ)

ఆచార్య సుబ్రహ్మణ్యం ఆలోచనలు నిర్వచనాలుగా నిలుస్తూ లక్షణసూత్రాల్లాగా రాణిస్తుంటాయి. నిదర్శనానికి ఈ పంక్తులను దర్శించవచ్చు - "ఒకటిలో ఉన్న పదిని దర్శించటం విమర్శ; పదిలో ఉన్న ఒకటిని దర్శించటం పరిశోధన" (పరిశోధనం). "గతాన్ని మథించి కొత్తను సృష్టించడమే ప్రతిభచేసే పని" (సమ్యగ్ దృష్టి). "తెలిసి చెప్పేవాడు కాన్షస్ ఆర్టిస్ట్. చెప్పి తెలుసుకునేవాడు అన్‌కాన్షస్ ఆర్టిస్ట్." (కాదా?)

డా॥జి.వి. సుబ్రహ్మణ్యం ప్రామాణిక విమర్శకాగ్రేసరులు. ధ్వనిలో రసధ్వనిలాగా విమర్శలో ఆయనది తాత్వికదర్శనం. విమర్శను గూర్చి ఆ ఆలోచయిత చెప్పిన పంక్తులు మనకు సదా మననీయం. ఆ పంక్తులివి-"సాహిత్య విమర్శకు భౌతిక దర్శనం ప్రాతిపదిక మానసిక దర్శనం హృదయదీపిక; తాత్వికదర్శనం ప్రగతి ప్రకాశిక" (విటత్వమా? వీరత్వమా?). "వేడిపాలల్లో వెన్నతీయటమే కావ్యంలో సాహిత్యదర్శనాన్ని సమీక్షించటం" - పాలు పెరుగు, వెన్న

ఆచార్య సుబ్రహ్మణ్యం ఆలోచనలు కొన్ని కర్తవ్యాన్ని ప్రబోధిస్తాయి. ఉదాహరణకు ఒక్కటి- "అభ్యుదయం కోరేవాడు గతంలోని అభ్యుదయాన్ని గౌరవించాలి. వర్తమానంలోని అభ్యుదయాన్ని ఆహ్వానించాలి. అంతటితో ఆగిపోక భవిష్యత్తు కోసం అభ్యుదయాన్ని అన్వేషించాలి" (సమ్యగ్ దృష్టి).

ఈ సంపుటిలోని వ్యాసాలు చాలా వరకు ఒక కవి సూక్తితో ప్రారంభమవుతాయి. ఆ సూక్తులు ఆధారంగా వ్యాసాలకు చక్కని శీర్షికలను నిలిపారు శ్రీసుబ్రహ్మణ్యం. ఈ శీర్షికలు ఆ కర్షణీయంగా ఉండి సహృదయపాఠకులను రంజింపజేస్తాయి. ఆచార్య సుబ్రహ్మణ్యం శైలి మనోహరమై కవితాసౌరభాలను ప్రసరిస్తుంది. ఆయనలో ఒక సత్కవి దాగి ఉండడం వలన రచనలో ఒక రామణీయకత తళుక్కుమంటుంది. పద్యాలను తాత్త్వికంగా వ్యాఖ్యానించడంలో ఆచార్య సుబ్రహ్మణ్యం ప్రదర్శించిన విమర్శ ఆశ్చర్యానందాలను కలిగిస్తుంది. ఈ వ్యాఖ్యలు పాఠకులనెంతో ప్రభావితం చేస్తాయి.

మానవుని ఆలోచన యొక్క గొప్పతనం గూర్చి ఆచార్య సుబ్రహ్మణ్యం వ్రాసిన ఈ పంక్తులు సదాస్మరణీయం- "ఒక జాతి అమరత్వం అది చేసే ఆలోచనలో ఉంది. ఆలోచనలతో మానవుడు జ్ఞానశిఖరాల నధిరోహిస్తాడు. అమృతమైన అనుభూతిలో తరతరాలు జీవిస్తాడు. మనిషికి అన్నమెంత అవసరమో ఆలోచన అంత అత్యవసరం" (అమృతం)

విమర్శకాచార్య ఆచార్య సుబ్రహ్మణ్యం దివ్యస్మృతికి ఈ 'ఆలోచనం' సంపుటం అంకితం కావటం ఎంతో సముచితం. దీనివల్ల 'యువభారతి' కృతజ్ఞతామతి సంసూచితం.

ఈ 'ఆలోచనం' సహృదయుల ఆదరాభిమానాలకు పాత్రమవుతుందని నా ప్రగాఢ విశ్వాసం.

# విషయ సూచిక



"చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది"



# అమృతం

*సంగీత మపి సాహిత్యం*
*సరస్వత్యాః స్తనద్వయమ్*
*ఏక మాపాత మధుర*
*మన్య దాలోచనామృతమ్*

సంగీత సాహిత్యాలు సరస్వతి స్తనద్వయం వంటివి. ఒకటి ఆపాతమధురం మరొకటి ఆలోచనామృతం. స్వాదువైనదీ, ప్రియమైనదీ మధురం. అనుభూతికి మారుపేరు మధురం. మొదటినుండి తుదిదాకా మధురమైన అనుభూతి నందించేది సంగీతం. సాహిత్యం ఆలోచన ప్రధానమైంది. ఆలోచనం భావనకు, దర్శనానికి మారుపేరు. ఆలోచన అమృతాన్ని వర్షిస్తుంది. అమృతంలో మాధుర్యముంది. అనుభూతికి అమరత్వాన్ని కల్పించే విశేషమైన శక్తికూడా ఉంది. మానవుడు సాధించే మహోన్నతమైన మానసికావస్థ అక్షయమైన అనుభూతి. అందులోనే అతడు చిరంజీవిగా బ్రతుకుతాడు. మనిషి అమృతత్వాన్ని సాధించటమే విశ్వశ్రేయం.

సంగీత సాహిత్యాలు రెండూ మౌలికంగా శబ్దప్రధానాలే. సంగీతంలో స్పష్టమైన శబ్దం సరాసరి సామాజికుని హృదయాన్ని స్పృశిస్తుంది. దాన్ని కరిగిస్తుంది. తానూ కరిగిపోతుంది. సాహిత్యంలో శబ్దం మనస్సునూ, బుద్ధినీ తాకుతుంది. బుద్ధి శబ్దంలోని అర్థాన్ని గ్రహించి వికసిస్తుంది; ఆ వికాసంలో అమూర్తమైన భావం దర్శనమిస్తుంది. ఆ దర్శనం మనస్సును ద్రవింపచేస్తుంది. రూపుకట్టిన శబ్దం అందించే అనుభూతి ఎంత మధురమైందో - అంత అమృతమైంది. రూపుకట్టిన శబ్దం అందించే అనుభూతి ఎంత మధురమైందో - అంత అమృతమైంది. సంగీతంలో బుద్ధి వికసనంలేని మనోద్రుతి ఉంది. అందువల్లనే 'శిశుర్వేత్తి పశుర్వేత్తి' అనే సూక్తి పుట్టింది. సాహిత్యంలో ధ్వనించే శబ్దం శిశువులనూ పశువులనూ రంజింపచేసేది కాదు. సంస్కారియైన సహృదయుడికే అది ప్రసన్నమౌతుంది. సాహిత్యంలో ఆలోచనం అనుభూతికోసం సామాజికుడు చేసే మానసికయోగం. శబ్దాన్ని సార్థకంగా భావించటమే సాహిత్యపరుడు సాధించేయోగం. మూర్తమైన శబ్దార్థం జ్ఞానకిరణం. జ్ఞానంవలన యోగి ఆత్మానందాన్ని పొందుతాడు. సహృదయుడు రసానందాన్ని సాధిస్తాడు. రసానందానికే మారుపేరు ఆలోచనా మృతం. ఆ అమృతాన్ని సేవించి 'రసోవైసః' అని కీర్తిస్తాడు మానవుడు.

సంగీతంలో సరస్వతి చెవులకు వినిపించి, మనసులో కరిగిపోతుంది. సాహిత్యంలో సరస్వతి ఆలోచనలో రూపుకడుతుంది. అనుభూతిలో నిలిచిపోతుంది. కవికీ, సహృదయుడికీ ఈ అనుభూతి సమంగా కలుగుతుంది. సాహిత్యంలో ఆలోచన జాతిని భావనామయం చేస్తుంది; ఆంతరజగత్తుకు ఆకృతినందిస్తుంది; ఆకృతి సాక్షాత్కారంలో అక్షయ సుఖాన్ని ఆస్వాదింప చేస్తుంది.

ఒకజాతి అమరత్వం అది చేసే ఆలోచనలో ఉంది. ఆలోచనతో మానవుడు జ్ఞాన శిఖరాల నధిరోహిస్తాడు. అమృతమైన అనుభూతిలో తరతరాలు జీవిస్తాడు. మనిషికి అన్నమెంత అవసరమో ఆలోచన అంత అత్యవసరం. అనాదికాలంనుంచీ అనవరతం సాగిస్తున్న విశ్వజీవితసారం ఆలోచనామృతం!

***జనవరి 1975***

# కొత్త - పాత

పురాణ మిత్యేవ న సాధు సర్వమ్
న చాపి కావ్యం నవ మి త్యవద్యమ్
సన్తః పరీక్ష్యాన్యతర ద్భజన్తే
మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః - కాళిదాసు

పాతదైనంత మాత్రాన ప్రతిదీ ప్రశస్తమైంది కాదు. కొత్తదైనంతమాత్రాన కావ్యం నిరసింపదగింది కాదు. విజ్ఞులు పరిశీలనానంతరం దాని బాగోగులు నిర్ణయిస్తారు. మూఢులు ఇతరుల అభిప్రాయాలను అనాలోచితంగా అనుసరిస్తారు.

ప్రాచీనమూ, నవీనమూ అనేవి కాలం గీసే గీతలు. చరిత్రకు పనికివచ్చే విభాగాల వింగడింపు. కవిత్వంలో కానవచ్చే ప్రతిభ నవనవోన్మేషమైంది. అది ఎల్లప్పుడూ కొత్తదే. కొత్తదనమే దాని లక్షణం. ప్రతిభ ప్రకాశించటానికి పరిధుల్లేవు. కాలంలో దానికి అవధుల్లేవు. వేదకవి నుండి విప్లవకవిదాకా వర్తించే సార్వకాలిక సత్యం ఇది. ప్రతిభను గౌరవించనివాడు కవి కాలేడు.

'కొత్తొక వింత పాతొక రోత' అన్న సామెత పరిస్థితులకు వర్తించినంతగా ప్రతిభకు వర్తించదు. పాతకూడా ఒకనాడు కొత్తగా వెలిగిపోయిందే. అయితే ఆ పాతనే పట్టుకొని ప్రాకులాడటం పరప్రత్యయనేయబుద్ధుల లక్షణం. తల్లి పొదుగును కుమ్మి లేగ దూడ కొత్తపాలతో కడుపు నింపుకుంటుంది. కొత్త చేవను సంతరించుకుంటుంది. గతాన్ని మథించి కొత్తను సృష్టించడమే ప్రతిభ చేసేపని. గతాన్నంతా గౌరవించకపోయినా కొత్తనందించే దాని ఉత్తమ లక్షణాన్ని ప్రశంసిస్తుంది ప్రతిభ. ప్రకృతి పరిణామశీలమైంది కాబట్టి పాత, కొత్తను ప్రసవించి తీరుతుంది.

కొత్తదనం పుట్టుక వచ్చినప్పుడు వర్తమానానికి కొండంత సత్తువ వస్తుంది. అయితే అదే పరమార్థమని భజనచేస్తూ కూర్చుంటే ప్రగతి నశిస్తుంది. ప్రగతిపథంలో మహాప్రస్థానంచేసే ప్రతిభ నేటి కొత్తదనాన్ని చూచి నిమ్మకు నీరెత్తినట్లు నిలిచిపోదు. అలా నిలిచిపోవటం తథ్యమంటే ప్రతిభను ప్రచ్ఛన్నంగా ఖూనీ చేయటానికి ప్రయత్నించటం; కళ్ళకు గంతలుకట్టి గానుగెద్దులా జాతిని నడిపించటం.

నేటి కొత్తదనాన్ని అనుకరిస్తే పాతదనం అవుతుంది. అనుసరిస్తే భవిష్యత్తు భగ్నమౌతుంది. అనుసరణానికి ఎన్ని మారుపేర్లు పెట్టుకున్నా ఆత్మవంచనే అవుతుంది. కొత్తలో నుండి సరికొత్త పుట్టాలి. పుట్టింది పోషించే శక్తీ సహనం ప్రతి నవ్యప్రక్రియకూ ఉండాలి. పునర్నవం అభ్యుదయానికే అభ్యుదయం.

అభ్యుదయం కోరేవాడు గతంలోని అభ్యుదయాన్ని గౌరవించాలి. వర్తమానంలోని అభ్యుదయాన్ని ఆహ్వానించాలి. అంతటితో ఆగిపోక భవిష్యత్తుకోసం అభ్యుదయాన్ని అన్వేషించాలి. ఆ అన్వేషణలో గతంలోని గౌరవముంది. వర్తమానంలోని వాస్తవం ఉంది. భవిష్యత్తుకోసం ఆకాంక్ష ఉంది. అన్నింటినీ సమన్వయించే సమ్య గ్దృష్టి ఉంది.

ఫిబ్రవరి *1975*

జి.వి. సుబ్రహ్మణ్యం

# కృషి

'మంచి రచన చదివాక బాగా భోంచేసినట్టుండాలి
కొంచెం బాధపడాలి చింతకొన్నట్టుండాలి
మనస్సుకు జ్వరం రావాలి ఒళ్ళు తిరగాలి
ఈ బాధలోంచి తేరుకొని బాగుపడాలి' - సినీవాలిలో ఆరుద్ర

మంచి రచన మంచి భోజనమైతే, రచయిత మృష్టాన్నదాత. పఠిత ఆకొన్న అర్థి. మెదడుకు మేతపెట్టే మేధావి రచయిత. జీవితంలో అన్వేషించి సేకరించిన అపూర్వ పదార్థాలను, ఆస్వాద మధురంగా వండి వడ్డిస్తాడు రచనలో. వడ్డించిన పదార్థాలన్నీ ఒక్క కోవలో దొరికినవికావు. ఒక్క కోవలో వండినవి కావు. కానీ ఒక విస్తరిలో వడ్డించినవి. వార్చి వడ్డించిన వాడి శ్రమకేంగాని, తినేవాడి గొడవచూద్దాం. తినటానికి ముందు ఆకలంటూ వేయాలి. ఆకలితోపాటు రుచులూనే నాలుక ఉండాలి. నాలుకున్నా నమలి మింగే స్తోమత ఉండాలి. మింగినా జీర్ణించుకొనే శక్తి కావాలి. రక్తి ఉంటేనే భుక్తి దక్కేది; భుక్తి ఉంటేనే శక్తి వచ్చేది.

ఒక్కొక్క రచన ఒక్కొక్క జీవితానుభవసారం; విలువైన జీవితాన్ని వెలలేని అనుభవంకోసం వెచ్చించి తులలేని విజ్ఞానాన్ని పండించిన క్షేత్రం; క్షీరసాగర విజ్ఞానాన్ని పండించిన క్షేత్రం; క్షీరసాగర మథనంలా విశ్వజీవితసాగరాన్ని మథించి హాలాహలాన్ని కుత్తుకలో బిగబట్టి అమృతత్వాన్ని పంచిపెట్టే అమర సందేశం. ఆమెతగా అమృతాన్నందిస్తే ఆస్వాదించే యోగ్యత సామాజికుడు సాధించాలి.

విందుకు కూర్చున్నవాడు అర్ధాకలితో లేచిపోడు. అలాగే మంచిరచన చదువదలచినవాడు దానిని తుదముట్ట చదువుతాడు, లోతుపాతులను గ్రహిస్తాడు. అపార వ్యుత్పత్తినిచ్చే రచనను ఆస్వాదించి, ఆలోచిస్తాడు. ఆస్వాదిస్తున్నప్పుడు అతడు సహృదయుడు, ఆలోచిస్తున్నప్పుడు అతడు భావుకుడు. ఆలోచనలో రచనలోని సారాంశం, అంతరార్థం, సందేహం స్ఫురిస్తాయి. ఆ స్ఫూర్తికోసం పఠిత కొంత శ్రమపడతాడు. ఆ శ్రమలోనే కొంత బాధ ఉంది. కొంత వాడి ఉంది. ఆ శ్రమకు ఫలంగా అతడు పొందేది ఆలోచనామృతం; దానివల్ల అతనికందేది అభ్యుదయపథం.

జాతి ఎంత అన్నాన్ని జీర్ణించుకుంటుందో, అంత జ్ఞానాన్ని మననం చేసుకొంటుంది. జాతికి అన్నం పెట్టడానికి హలాన్ని పట్టి కృషీవలుడు కృషి చేస్తుంటాడు. జ్ఞానభిక్ష పెట్టటానికి కలంపట్టి కృతికర్త కృషి చేస్తుంటాడు.

వీరిద్దరూ జాతికి రెండు రెక్కలు.

మనస్వికి మంచిరచనం కంటే మించిన భోజనం లేదు. మంచి రచనలున్నా మన్నించే పఠిత లేకపోతే జాతి నీరసించి పోతుంది; మంచి పఠితలుండి మంచిరచనలు లేకపోతే సాహిత్య జగత్తులో క్షామం తాండవిస్తుంది. సారమెరిగిన సమాజంలో శక్తిమంతమైన రచన తప్పకుండా తలయెత్తుతుంది. సమాజశక్తి సాహిత్యానికి గీటురాయి. సమాజం కోరేది సాహిత్యంలో - విశ్వశ్రేయస్సు.

మార్చి 1975

# విశాల విశ్వాంధ్ర

అంతమంది తెలుగువాళ్లం
ఐకమత్యంగా ఉంటే
యావద్భారతంలోనూ రాణించగలం — శ్రీశ్రీ

ఆంధ్రులనూ అనైకమత్యాన్ని కలిపి చదువుతుంటారు చాలామంది. ఐకమత్యం ఉంటే అఖిలభారతంలో అగ్రతాంబూలం వారిదే అని ఆశాగీతాన్ని ఆలపిస్తుంటారు అందరూ! అన్నివేళలా ఆశల్ని నిరాశలు చెయ్యలేదు. ఆంధ్రులు అవసరాలకోసం అలజడులు రేపుకున్నా ఆఖరికి అందరూ అన్నదమ్ముల్లా ఉండటానికి అంగీకరిస్తారు. అంగీకారానికి అవధులు పెట్టుకోకపోయినా అన్నమాట కాదనకూడదనే ఆచారాన్ని గౌరవిస్తారు.

ఎన్నియుగాల చరిత్రోమనది! కడచిన వైభవానికి కవితలో కన్నీరు కారుస్తాం. గత వైభవాన్ని జాతికి ప్రబోధిస్తాం, ప్రబోధం ఫలించిన రోజున పండుగ చేసుకుంటాం. ప్రబోధానికి ప్రజలు ప్రాణాలనైనా అర్పిస్తారు. ప్రాణాల విలువలతో పతాకలను ఎగురవేసుకుంటాం. నాలుగు దశాబ్దాల రాష్ట్ర పోరాటం శ్రీరాముల ఆత్మార్పణంతో శివంకరంగా ముగిసింది. నాల్గు చెరగుల తెలుగుబిడ్డలు వెల్గురేకల్లా వెలగాలని విశాలాంధ్ర ఉద్యమం మోసుకొస్తుంది. అవగాహన ప్రాతిపదికగా ఆంధ్రప్రదేశ్ అవతరించింది. అతికిన ఈ బంధం గట్టిదా కాదా అని పరీక్షించుకున్నాం. అనుబంధం ఆసటగా అవిచ్ఛిన్న రాష్ట్రాన్ని ఆచరణయోగ్యం చేయాలని అహో రాత్రాలు కృషిచేస్తున్నాం. "అవసరాన్నిబట్టి ఐక్యత" అన్న సూత్రం నాటి మాట. అభ్యుదయానికి అంతస్సూత్రం ఐక్యత' అన్నది నేటి మాట!

విశ్వదృష్టి ఏర్పడ్డ ఈ వైజ్ఞానికయుగంలో మనం కట్టుకొనే కోటలూ గోడలూ కాలగతికి కటకటాలు. తెలుగుతల్లి కన్నబిడ్డలు త్రిలింగ క్షేత్రంలోనే వెలిగిపోవాలనుకోవటం కూపస్థ మండూకభావం. ప్రపంచమంతా మనదే; విస్తరిల్లటం వివేక లక్షణం; ఎక్కడున్నా తెలుగువాణ్ణని మరవకపోవటం కనీసం ధర్మం. ప్రపంచ పరిధిలో ప్రసారం గాని జాతికి, భాషకు ప్రగతి లేదనేది ప్రత్యక్షర సత్యం.

ఎన్నో దేశాల్లో ఎన్నో ప్రదేశాల్లో తెలుగుబిడ్డలు ప్రపంచ సంస్కృతీ వికాసానికి దోహదం చేస్తున్నారు. మనం మనం అనుకోవటమే కాని మన జనం ఎంతమందో ఒక సారైనా ఆలోచించలేదు. ఈ రోజు ఇరుకు గదుల్లో నుండి లేచి ఇలాతలాన్నంతా చూస్తున్నాం. ప్రపంచ తెలుగు సోదరుల్ని గొంతెత్తి పిలుస్తున్నాం. ఆంధ్ర మహాసాగరంలా అందరం కలిసి అలల చేతులెత్తి జైకొట్టుతున్నాం. అవగాహన ప్రాతిపదికగా మరలా అఖిల విశ్వ ఆంధ్ర పరిషత్తును కాంక్షిస్తున్నాం. ఈ ఉగాది తెలుగు తల్లికి మరపురాని మరో యుగాది.

*ఏప్రిల్ 1975*

# తెలుగు పండుగ

ప్రపంచ తెలుగు మహాసభలు వైభవోపేతంగా ముగిసాయి. హైదరాబాదులో తెలుగు వైభవం వెల్లివిరిసింది. తెలుగువారి సమస్యల మీద చర్చాగోష్ఠులు జరిగాయి. తెలుగు సంస్కృతిని ప్రతిబింబించే సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. తెలుగు చరిత్రను చిత్రించే ప్రదర్శనలు జరిగాయి. తెలుగు నాయకులు జాతిసమైక్యతను ప్రబోధించారు. తెలుగు కవులు జాతివైభవాన్ని కీర్తించారు. విదేశాల నుండి, వివిధ రాష్ట్రాల నుండి ప్రతినిధులు వచ్చి తెలుగు పండుగను తిలకించారు. వివిధ రంగాల్లో కృషి చేసిన వారికి సన్మానాలు జరిగాయి. లక్షలాది ప్రజలు నాగార్జున పీఠంలో, కాకతీయ నగరంలో, విజ్ఞాన వినోద కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఇంత పెద్ద యెత్తున యిటువంటి మహాసభలు జరుపుకోవటం తెలుగువారి కీర్తికి, సమైక్య శక్తికి తార్కాణంగా చరిత్రలో నిలిచిపోతుంది.

మహాసభలు సాధించే ప్రయోజన మేంటి? అవి ఎలా నిర్వహింపబడాలి? అన్న అంశాల మీద కొందరికి భేదాభిప్రాయాలు ఉండవచ్చు. లక్షలు ఖర్చుచేసి ఈ మహాసభలు ఎందుకు చేయాలి అని విమర్శించవచ్చు. లక్షలు ఖర్చు చేసి జాతి విచ్ఛిన్న శక్తులను పోషించిన మనం సమైక్యతను సాధించుకోవటానికి లక్షలు ఖర్చు పెట్టాల్సిన అవసరాన్ని సృష్టించుకున్నాం. సాహిత్య సాంస్కృతిక రంగాల్లో సమైక్యతను కొత్తగా సృష్టించాల్సిన అవసరం లేదు కాని రాజకీయ ఆర్థిక రంగాల్లో సమైక్యతను సాధించుకోవాలి. రాజకీయ నాయకులు ఈ సభల ద్వారా ఆ సమైక్యతను సాధించే ప్రయత్నాన్ని తీవ్రతరం చేస్తే కొంత వరకు ప్రయోజనం సాధింపబడినట్లే. భావ సమైక్యతను సాధించే ప్రాతిపదికలు పటిష్ఠంగా పడినప్పుడే ఖర్చు పెట్టిన ప్రజాధనం సద్వినియోగం అయినట్లు! ఈ అనంత కృషికి ఈ సభలు నాందియే కాని భరతవాక్యం కారాదు.

తెలుగు భాషలో మాట్లాడటం దగ్గర నుంచి, ప్రపంచంలోని తెలుగు వారిని సదవగాహనం చేసుకొనేంత  వరకు ఎన్నో మెట్లెక్కాలి మనం. ఇంట గెలవందే రచ్చ గెలవలేం. ఉట్టినే ఎక్కలేకపోతే స్వర్గానికేం ఎక్కగలం? తెలుగు సంస్కృతి సంవత్సరంగా పాటింపబడుతున్న ఈయేడు తెలుగువారి మనసులన్నీ ఏకం కావటానికి భారత దేవంలో మన మనుగడ పెంచుకోవటానికీ, విశ్వవ్యాప్తమైన తెలుగువారిలో సదవగాహనం పెంపొందింప జేసుకోవటానికీ కృషి చేయాలి. విశ్వదృష్టి విభేదదృష్టికి విరుగుడు కావాలి. తెలుగు జాతి సమైక్యశక్తితో పైకి లేవాలి. రాజకీయ, మత, కుల, వర్గ దృక్పథాలు ఈ సాధనకు బాధకాలు కారాదు. తెలుగు తల్లికి సమర్పించే మల్లెపూలు ఏ తోటలోనో పూచినవి కావు; మనస్సుల్లో విరిసిన సంకల్పసుమాలే!

*సంఘర్షణ సమాజచైతన్యానికి ప్రగతి శీలం! సాహిత్యంలో విస్ఫులింగాల వియల్లాస్యానికి వినూత్నావకాశం. ఆలోచనలకు అలజడులకు అవకాశమున్నా అడుగువడిపోయిన అనర్ఘసత్యాన్ని అన్వేషించడానికది ఒక అమూల్యావకాశం* — *జి.వి.యస్ (మహతి)*

**మే 1975**

# విద్య

విశ్వవిద్యాలయ విద్యా విధానం మీద నేడు విద్యావేత్తలలో ప్రధానంగా రెండు రకాల అభిప్రాయాలున్నాయి. విశ్వవిద్యాలయం విద్యార్థిని మేధావిగా తీర్చిదిద్దాలని ఒక అభిప్రాయం. ఉన్నత విద్య ఉద్యోగవిధికి తోడ్పడాలని మరొక అభిప్రాయం. మొదటిది విశ్వవిద్యాలయ విద్యాధ్యేయానికి సబంధించింది, రెండవది విద్య జీవితోపయోగి కావాలని ఆశించేది. ఉన్నత విద్య చదివేది ఉద్యోగం కోసమేనా? అన్నది మరో ప్రశ్న. ఉద్యోగం లేకపోతే జీవితం గడవదు కాబట్టి, ఉన్నత విద్యార్హతలు లేకపోతే ఏ చిన్న ఉద్యోగమైన దొరకటం కష్టమైపోతున్నది కాబట్టి, విశ్వవిద్యాలయాలు ప్రాథమికంగా విద్యార్థులను చక్కని ఉద్యోగులుగా తయారు చేయగలగాలని కొందరు భావిస్తున్నారు.

వృత్తి విద్యలు క్రమంగా వెనుకబడి పోతున్న ఈ రోజుల్లో, వంశపారంపర్యంగా వచ్చేవే వృత్తులనే భావం అంతరించిపోతున్న ఈ కాలంలో వృత్తి విద్యలకు ప్రత్యేక విద్యాలయాలు కావాలి. అలాగే సాంకేతిక విద్యలూ, పరిపాలనకు సంబంధించిన విద్యలూ-వాటికీ విద్యాలయాలు కావాలి. ఆ విద్యాలయాల్లో ఆయా ఉద్యోగాలకు తగిన తరిఫీదు ఇవ్వబడవచ్చు. అట్టి విద్యకూ విశ్వవిద్యాలయాలకూ సంబంధం ఉంచటం అంత మంచిది కాదు. అన్ని రకాల విద్యలూ అందరికీ అవసరంకావు. కాని ఉన్నత విద్యా ప్రమాణాలతో సమగ్ర వ్యక్తిత్వాన్నీ, పరిశోధన పిపాసనూ, సత్యాన్వేషణ దృష్టినీ విద్యార్థికి ప్రసాదించే విద్యాప్రవృత్తి మాత్రం విద్యార్థులందరికీ అవసరం. ఉన్నత విద్య నభ్యసించే అభిరుచి అందరికీ ఉండకపోవచ్చు. అవకాశము కల్పించ వచ్చును కాని విద్యార్థులకు అభిరుచులను మాత్రం కల్పించలేము. అభిరుచిలేనిది ఉన్నత విద్యలో ఆంతరమైన వ్యక్తిత్వం పెరగదు. అభిరుచి జిజ్ఞాసను పెంచుతుంది: జిజ్ఞాస విజ్ఞానాన్ని ఆపోశన పడుతుంది. విజ్ఞాన వికాసంతోపాటు వ్యక్తి వికాసం కలుగుతుంది. సమగ్రవ్యక్తివికాసం జాతివికాసానికి మూలకందం. విశ్వవిద్యాలయాలు విజ్ఞానవికాసానికీ, వ్యక్తివికాసానికి శిక్షణ కేంద్రాలు కాని, ఉద్యోగులకు ఉత్పత్తి క్షేత్రాలు కావు. మేధావులను సృష్టించే ఉన్నతవిద్య దేశానికి ఉత్తమ నాయకుల్ని ప్రసాదిస్తుంది.

ప్రతి పౌరుడూ విద్యావంతుడు కావాలన్నది ప్రజాస్వామ్య ప్రభుత్వాల ప్రాథమిక లక్ష్యం. విద్యార్థులందరికీ సమానావకాశాలు కల్పించటం ప్రభుత్వ ధ్యేయం. కాని ప్రతి పౌరుడూ మేధావి కాలేడని అందరికీ తెలిసిన సత్యం. విశ్వవిద్యాలయాలు మేధావులను సృష్టించేవి. ఉద్యోగ విద్యలకు వేరు వేరు విద్యాలయాలు చాలు. మేధావులు మెండుగా వెలసిన దేశం ప్రపంచంలో మణిపూసగా నిలువగలుగుతుంది.

*జూన్ 1975*

# పరిశోధనం

పరిశోధన మంటే ఈ మధ్య పరిహాసానికి పాత్రం కావటం వింటున్నాం. అది సాహిత్యాన్ని గానీ, సమాజాన్ని కానీ ఉత్తేజితం చెయ్యటం లేదని పలువురు భావిస్తున్నారు. ఆ మాటలో నిజంలేదని ఎవరూ గొంతెత్తి చెప్పటం లేదు. అసలు నిజంచెప్పే ధైర్యం పరిశోధనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత - మారిపోయిందని. కొందరు విచారిస్తున్నారు. ఉన్నవిషయాన్ని ఊహ కందినంత వరకు ఉల్లేఖించి చెప్పే వాళ్ళెక్కువైనారు. కాని, తత్వాన్ని దర్శించి సార్వకాలీన మైన సత్యాన్ని చెప్పేవాళ్ళు తక్కువైనారు. అంటే విషయ విశ్లేషణం విస్తరించి విశిష్ట దర్శనం అస్తమిస్తున్నదన్నమాట!

దర్శన ప్రభావం కాలావధులు దాటి కలకాలం నిలుస్తుంది. గిడుగువారి భాషా పరిశోధన ఒక దర్శనం. దాని ప్రభావం నేటి వచన రచనలమీద అపారం. సాహిత్యాన్ని, సమాజాన్ని గతానుగతికమైన ఒక మార్గాన్నుంచి క్రొత్తమలుపు మళ్ళించింది గిడుగువారి పరిశోధనలు! 'అటువంటి పరిశోధనం లేదేం నేడు? దాని ప్రభావాన్ని తెలుగువాళ్ళందరూ పంచుకోరేం?' అన్నది నేటి చాలామంది మీమాంస!

పరిశోధన పరమార్థం దర్శనం. దర్శనం లేని విమర్శనం ఉపరిశోధనం. అయితే అది అంధాన్వేషణ మౌతుంది; వికటిస్తే రంధ్రాన్వేషణ మౌతుంది. పరిశోధనలో విషయ సేకరణం ముడిసరుకును తెచ్చి కుప్పపోయటం లాంటిది. విషయ విశ్లేషణం జాతిగుణ విభాగం లాంటిది. ఒకటి మొదటి మెట్టు; ఆపైది రెండవ మెట్టు. ఇవే పరిశోధనగా భావిస్తారు కొందరు. నిజానికి పరిశోధన అక్కడ ప్రారంభమౌతుంది. అక్కడ సాధింప వలసింది సత్యం - లేక - సౌందర్యం. యోగి సంవత్సరాల తపస్సు బ్రహ్మజ్ఞానం పొందినప్పుడే తపస్సనిపించుకుంటుంది! లేకపోతే ఉషస్సులేని తమస్సులా కళా విహీన మౌతుంది. ఒకటిలో ఉన్న పదిని కనిపెట్టటం విమర్శ; పదిలో ఉన్న ఒకటిని దర్శించటం పరిశోధన! విమర్శనే పరిశోధన మంటున్నాము నేడు చాలావరకు. పరిశోధనకు పూర్వరంగం విమర్శ. విమర్శకు అనుభూతి అవసరం లేదు; వివేచనముంటే చాలు. పరిశోధనకు అనుభూతి కావాలి. అనుభూతిని ఆవిష్కరించే ఆర్జవమే దర్శనం. దర్శనం ఒక క్రొత్త వెలుగు. క్రొత్త వెలుగులో పాతవస్తువులు కూడా కొత్తగా మెరిసిపోతాయి. మరో ప్రపంచం మొలిచినట్లుంటుంది. తరతరాలకు అది శిరోధార్య మౌతుంది.

పరిశోధనలో దార్శనికత్వం లోపించటం చేతనే, అది పరిహాసాల పాలవుతున్నది. పరిశోధన పదవులెక్కితే వచ్చేది కాదు! బండెడు కాగితాలను నలుపుచేస్తే నిలిచేదికాదు; పది తాటాకు గ్రంథాలను బూజుదులిపితే రాదు; వేయి శాసనాలను వెలికితీస్తే కాదు. కాని, అవన్నీ అంగాలే. అంగియైన తత్వం ఆవిష్కరింప బడకపోతే అవన్నీ వాసనలేని కాగితప్పూలే! పరిశోధనలో పరిమళం కోసం పడిగాపులు పడుతున్నది తెలుగు సాహిత్యం నేడు!.

*జులై 1975*

# పగ

పగ యడగించు టెంతయు శుభం బది లెస్స; అడంగునే పగం
బగ; పగ గొన్న మార్కొనక పల్కక యుండగ వచ్చునే; కడుం
దెగ మొదలెత్తి పోవఁబగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్యమొందు; నే
మిగతిఁదలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా!

పగవారిచేత వగగొన్న ధర్మరాజునోట వెలువడ్డ వెలలేని సూక్తియిది. పగ పొగ లాంటిది. నిర్మలమైన వాతావరణాన్ని కలుషితం చేస్తుంది. నిజాన్ని చూచే కన్నులకు అడ్డం నిలుస్తుంది. స్నిగ్ధమైన చూపుల్ని చింతనిప్పుల్లా మారుస్తుంది. మనసులోని మమతను మారణహోమం చేస్తుంది. పగ కోరేది పరాయివాళ్ల వగ, వగనొందిన విరోధుల్ని చూచి పగ పగలబడి నవ్వుతుంది. పగవారు కల్పించిన పగతో నలిగి నాశనమయ్యేవాడు బలహీనుడు. బలవంతుడు పగను వగతో ఢీకొంటాడు. బలాబలాలను పరీక్షించు కొంటారు. కాని, సంఘర్షణలో శాంతి నశిస్తుంది. కరుణకు బదులు క్రౌర్యం విలయతాండవం చేస్తుంది. క్రౌర్యం మానవుణ్ణి క్రూరజంతువులా మారుస్తుంది.

పగలు మనిషికీ మనిషికీ మధ్య ఉండవచ్చు. దేశాలకీ దేశాలకీ మధ్య ఏర్పడవచ్చు. జాతులమధ్య రగులుకోవచ్చు, మతాలమధ్య కార్చిచ్చులా వ్యాపించవచ్చు. నరజాతి చరిత్రలో ఈ పగ రక్తపిపాసతో రాజ్యం చేస్తుంది. ప్రపంచ సంక్షోభానికి ప్రాతిపదికలు వేస్తుంది. ప్రజల బ్రతుకుల్లో ప్రతిక్షణంనరకాన్ని ప్రత్యక్షం చేస్తుంది. పగ శాంతిస్తేనే ప్రపంచశాంతి ప్రకాశిస్తుంది.

పగ తెలిస్తే ప్రాణం తీస్తుంది. అంటే భౌతికంగా పగను సృష్టిస్తుంది. నైమిత్తికంగా ఏర్పడే పగకు నైతికమైన గౌరవం లేదు. నైతికమైన విలువ జీవితానికి సహనం వల్ల వస్తుంది. బలం ప్రతీకారాన్ని కోరితే సహనం నిగ్రహాన్ని నిర్దేశిస్తుంది. సామర్థ్యం ఉన్నవాడే సహనాన్ని ప్రకటింపగలడు.

పగ పాశవికత్వానికి ప్రతీక అయితే- సహనం సంస్కృతికి సమున్నత కేతనం.

దౌర్జన్యానికి తలవంచటం సహనం కాదు. పగవల్ల కలిగిన పగను సహించటం సహనం కాదు. దౌర్జన్యంలోని దౌష్ట్యాన్ని సౌజన్యంతో తొలగించటం సహనం. పగలోని పారుష్యాన్ని తగవెరిగిన నీతితో నిగ్రహించటం సహనం. సహనం సమర్థులకు పిరికిమందు కాదు. అవసరమైతే పగవారి గుండెల్లో సెగలుకమ్మించే మందుగుండు. రణపాఠం పఠించినా దానికి ఫలం పగవాడికి గుణపాఠం. సహనం ప్రాణాలను బలి కోరదు. పరులలో పరిణామాన్ని కోరుతుంది. మనిషిలోని పశువును చంపి పరమాత్మను ప్రబోధిస్తుంది. అధర్మాన్ని శిక్షించి ధర్మాన్ని రక్షిస్తుంది.

*తిరుపతి వేంకటకవుల కవితాశంఖారావం విన్న తెలుగు కవికి భయంతొలగింది. కలంసాగింది. ఉజ్జ్వలమైన భవిష్యత్తుగోచరించింది. ఇక కొన్ని శతాబ్దులవరకు కవిత్వం చావలేదనే ధైర్యం కలిగింది. ఆ జంటకవుల దృష్టి ప్రాచీన కవితపై ఒక దివ్యాలోకం నవీనకవితపై ఒక నవ్యాలోకం*

- జి.వి.యస్. (తిరుపతి వేంకటకవుల కవితావైభవం)

ఆగస్టు 1975



జి.వి. సుబ్రహ్మణ్యం

# తిమిరంతో సమరం

తిమిరంతో ఘన సమరం
జరిపిన బ్రతుకే అమరం
కవితా తేజో వలయం
అవని శాంతికది నిలయం

కవితా శరధి యైన దాశరథి కలంనుండి వెలువడ్డ. కవితా తరంగం ఇది. ఆ మహాకవి జీవితానికీ, కవితా జీవితానికీ వర్తించే రససూత్రం, 'తమసోమా జ్యోతిర్గమయా' అని ఆలపించిన ఆర్షకంఠం నాటినుండి నేటి దాశరథి దాక ప్రపంచంలో అవిశ్రాంతంగా సాగుతున్న పోరాటం యీ తిమిరంతో సమరం. చీకటి వెలుగుల ద్వంద్వ యుద్ధమే విశ్వచరిత్రలో ఆటూపోటుల అనుక్రమణం.

తిమిరం జడం. కాంతి చైతన్యం. ఒకటి మృత్యువు ఒకటి సృష్టి. స్పష్టమైన సృష్టిని మ్రింగేయాలని మృత్యువు యత్నిస్తుంది. మృత్యువును గెలవాలని సృష్టి సమరం సాగిస్తుంది. 'మృత్యోర్మా అమృతంగమయ' అనే ఆర్షసూక్తి ఈ సమర గీతంలో వినబడే అనుపల్లవి.

తిమిరం నలుపుకు ప్రతీక. విశ్వశ్రేయానికి విరుద్ధమైన భావం తిమిరం; అభ్యుదయానికి అవరోధంగా నిలిచేది తిమిరం. ప్రకృతిలో కనపడే వికృతి తిమిరం. ప్రకృతికి విరుద్ధమైన వికృతి ప్రకృతిలోనే పుడుతుంది. వేరు పురుగులా దానిని తొలుస్తుంది. సమూల నాశనానికి దారి తీస్తుంది. వికృతికి విరుగు పెట్టటమే సమరం; అదే వెలుగు, వెలుగు చీకటిని వెన్నాడి తరుముతుంది. కాంతి విశ్రాంతికి చిహ్నమౌతుంది. విచిత్ర మేమిటంటే వెలుగునీడలోనే తిమిరం నిలవచ్చు. తననీడను కూడా తలదన్ని నిలిచే వెలుగే అమరం. అందుకే అమరులకు కనురెప్పపాటు లేదంటారు; చివరకు నీడకూడా పారదంటారు.

మానవజీవితం సాధించే చివరిమెట్టు అమరత్వం. అమరత్వం అనవరత సమర సంకేతం. చీకటితో చేసిందే సమరం. తిమిరమంటే అజ్ఞానం కావచ్చు, అహంకారం కావచ్చు, నిర్దయ కావచ్చు! పారతంత్ర్యం కావచ్చు, పరులను దోచుకోవటం కావచ్చు, శత్రువ్యూహం కావచ్చు, మిత్రద్రోహం కావచ్చు, స్వార్థం కావచ్చు, సామ్రాజ్యవాదం కావచ్చు? వేదనకావచ్చు, వేర్పాటు ధోరణికావచ్చు, అనైకమత్యం కావచ్చు, అవినీతి కావచ్చు, ఇలా ఏ కాలంలో ఏ ప్రాంతంలో ఏ విధంగా పాటమరించినా దానితో సమరంచేయుటయే కాంతి కిరణానికి లక్షణం. ఈ కాంతికిరణం కలలో మొలవచ్చు, కరవాలంలో మోహరింపవచ్చు. ఒక్కొక్కసారి రెండూ కలిసి కాంతికవాటం తెరవచ్చు. కలకాలం నిలవచ్చు.

అయితే కలాన్నీ కరవాలాన్నీ కదిలించేది మానవుడు. కదిలిన ఆ రెండూ మనిషినే బలితీసుకోరాదు. మనిషిని మరచిపోయిన మహాసమరం కూడా తిమిరమే. ఆ తిమిరాన్నుండి దూరం కావాలని విశ్వాత్మ ఘోషిస్తున్నది. చరిత్రలో దాని అడుగుల చప్పుడు వినపడుతున్నది.

'మానవత్వం గెలుస్తున్నది - దానవత్వం ఓడుతున్నది - అవనిలో హృదయాలలో గల అంధకారం వీడుతున్నది' దాశరథి.

సెప్టెంబర్ 1975

# అక్టోబరు రెండు

అక్టోబరు రెండవ తేది జాతిపిత గాంధీజీ పుట్టిన పర్వదినం. జాతిపిత జన్మదినోత్సవం వీరారాధన విశేషంగా చరిత్రకారులు చిత్రించవచ్చు. మనస్తత్వవేత్తలు రూపొందించవచ్చు. కాని స్వతంత్రభారత ఆవిర్భావానికి ఆ మహాత్ముడు కావించిన సమరం చరిత్రలో అజరామరం. స్వాతంత్ర్యం కోసం సమరంచేసే జాతులు చరిత్రలో నిలిచి ఉన్నంతవరకు  గాంధీజీ జన్మదినోత్సవం అఖిల విశ్వానికి ఆదర్శశిఖరం.

తల్లి పాంచ భౌతిక శరీరాన్నిస్తుంది. అందులోని ఆత్మచైతన్యాన్ని ఆవిష్కరిస్తాడు తండ్రి. తరతరాలుగా ఒకజాతి నిండుగా దండిగా స్రవంతిలా ప్రవహిస్తూ ఉండవచ్చు. ఆ నిండుదనంలో పండిన ఆత్మచైతన్యం పది కాలాలకొక్కసారి పర్వంలా పొంగివస్తుంది. జాతి క్రొత్తజన్మ ఎత్తుతుంది; కాలం కొత్తయుగానికి మేలు కొలుపు పాడుతుంది. ప్రగతి ప్రజాపథంలో పయనిస్తుంది. పారతంత్రంలో భారతదేశం ఆత్మస్థైర్యాన్ని కోల్పోయి కొడిగట్టిన దీపంలా కొనప్రాణంతో నిలిచి ఉన్నప్పుడు గాంధీజీ ఆ దీపానికి ఆత్మతేజస్సునిచ్చేస్నేహాన్ని, స్థైర్యాన్ని జాతికి నేర్పాడు. స్వీయ చరిత్రమంటే సత్యాన్వేషణమనీ, ధర్మసంగ్రామమంటే సత్యాగ్రహమనీ, మాధవసేవ అంటే మానవ సేవేననీ, మానవశీలంనుండే మహనీయుడుదయిస్తాడనీ, సమాజశక్తితోనే స్వరాజ్యరక్షణ యిమిడి ఉందని, సహనంలోనే సంయమనం, సమన్వయం, సౌజన్యం ముప్పిరిగొని సంస్కృతి శాంతి వనంలా వికసిస్తుందని ఆ మహామహుడు మనజాతికి ప్రబోధించాడు. ఆయన ప్రబోధం ఒకచైతన్యం. ఆ చైతన్యమే ఆయన్ని జాతిపితగా మనచేత భావింప చేస్తోంది.

పుట్టినరోజు పండుగలు వేడుకలకు మాత్రమేకావు. జాతిపిత పుట్టినదినం స్వతంత్రజాతి పుట్టినదినం. స్వాతంత్ర్యంకోసం సమరంచేసి స్వార్థంలేకుండా సమాజానికి అంకితమయ్యే సమున్నతశీలం గాంధీజీ జీవితసందేశం. ఈనాడూ మనజాతి ఆత్మశక్తికై అన్వేషిస్తోంది. అంతః పరిశోధన చేసుకుంటోంది. అడుగు ముందుకు వేస్తూ సాగిపోతోంది. హింసాహింసల మధ్య ధర్మాద్వైతం క్రొత్తదారులు వేస్తోంది. ఈ సంధియుగంలో ఈ జాతికి వెలుగుబాటగా నిలిచేది జాతిపిత మేల్కొల్పి 'ఆత్మచైతన్యశక్తి'. అఖిలభారత దేశం ఆత్మశక్తిని మేల్కొల్పిన అభ్యుదయ పథంలో అడుగుపెట్టే అమరభావానికి అక్టోబరు రెండు లౌకిక ప్రతీక. ఆచరణలోనే ఆధ్యాత్మిక శక్తిని దర్శించాలని మహాత్ముని అమర సందేశం.

> *ఒక జాతి చరిత్ర వ్రాయటం ఆ జాతి సాధించిన వికాసాన్ని వ్యక్తీకరింప చేయటం, గతంలోని సజీవ సంప్రదాయం, మార్పుచెందే వర్తమానానికి, రూపుకట్టే భవిష్యత్తుకు ప్రమాణసూక్తంగా పరిఢవిల్లుతుంది.*
> - జి.వి.యస్. (ఆంధ్ర పురాణము - ఇతిహాసలహరి)

*అక్టోబరు 1975*

# చివరకు మిగిలేది

కవి ప్రతిభలోన నుండును గావ్యగతశ
తాంశముల యందుఁదొంబది యైన పాళ్లు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాధృతిని మించి - శ్రీ విశ్వనాథ

కథంటే చెవికోసుకోవడం అనాదినుంచీ మనిషికున్న సహజగుణం. ఇప్పటికీ సీరియల్ కథలన్నా, సినిమాకథలన్నా, చిన్న కథలన్నా, చిత్రకథలన్నా జనం విరగబడుతోండటం చూస్తూనేఉన్నాం. కథలెందుకు చదువుతున్నారు? బాధను మర్చిపోవడానికంటారు కొందరు; కాలక్షేపానికంటారు మరికొందరు. కథలు చదివితే లోకాన్నిచదివినట్లే, మనుషుల మనస్తత్వాలను మననం చేసినట్లే అంటారు కొందరు. ఇదంతా కథను కథకోసం చదివేవారి దృక్పథం. కథను కథకోసమే చదివితే కాలక్షేపమౌతుంది. కాలక్షేపమే కాదు. జీవికి కావలసింది కలకాలం నిలిచే అనుభూతి. అనుభూతిని అస్వాదించడానికే అనవరతం లోకం అన్వేషణ చేస్తుంది. ఆరాటం పడుతుంది, కథలో చివరకు మిగిలేది అనుభూతి.

అఖిలసాహిత్యానికి అనుభూతి కేంద్రబిందువు. మనిషి దానిచుట్టూ ప్రతిభాసూత్రంతో సాహిత్యమనే సాలెగూడును అల్లుకుంటాడు. అనుభూతి ఆత్మవంటిది! పైకథంతా దాన్ని కప్పుకొనివున్న దేహకవచంలాంటిది. శరీరసౌందర్యం గుణ విలాసాలు ఆత్మరోచిస్సుల భౌతిక కలాపాలు. అనంత భౌతిక జీవితసారం ఆత్మావగాహనకు అమరిన రసకాసారం. అద్దంలాంటి సాహిత్యంలో ఆత్మ ప్రతిబింబాన్ని దర్శిస్తాడు సహృదయుడు. అంతర్ముఖంగా చూచి ఆత్మనే దర్శిస్తాడు ఋషిపుంగవుడు. ఆత్మను చూచుకున్నప్పుడు అనుభవాన్ని అస్వాదించే తాను ఉండి లేనివాడే అవుతాడు. ఆత్మ ప్రతిబింబాన్ని చూచుకున్నప్పుడు తాను తన అనుభూతిలో ఆనంద బిందువుగా నిలిచిన వాడవుతున్నాడు. అనుభూతి నుండి ఆకృతి వివేకాన్ని సాధించటం, ఆకృతి శిల్పంలో అనుభవానికి అక్షరార్చనచేయడం ఆర్షమతమని విశ్వనాథవారి వ్యాఖ్యానం. కథచదివితే బోధకలుగవచ్చు. మనస్సు వికసించవచ్చు. వికసించిన మనస్సు నుండి మకరందం స్రవించాలి. ఆ మరంద బిందు సందోహమే రసకాసారంలానిలవాలి. మనిషిలో చివరకు మిగిలేది ఆత్మ. ప్రతికథలో చివరకు మిగిలేది ఆత్మ. ప్రతికథలో చివరకు మిగిలేది రస పరమాత్మ-

జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్

నవంబరు 1975

# కవిత

ఘనతర ఘూర్జరీ కుచయుగ క్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుఁగవ లీల గూఢతయుఁ జాటు తనంబును లేకయుండఁ జె
ప్పిన యదె పో కవిత్వమనిపించు నగిం చటుగాక యుండినన్.

కవిత ఎలా ఉండాలో కవితామయంగా చెప్పిన నిర్వచనం యిది. అల్లసాని పెద్దన చాటుధారయని కొందరంటారు; బైచరాజు వెంకటనాథ కవి రచనయని కొందరంటారు. ఎవరైనా కవితాత్మగల రసికుడు రచించిన పద్యమిది.

కవిత్వం ఘూర్జరీ వనితల కుచయుగంలాగా గూఢత లేకుండా ఉండగూడదు. ద్రావిడీ వనితల వక్షోజాల్లాగా అస్ఫుటంగా నుండకూడదు; ఐతే తెలుగు పడుచుల పరచాటగు చొక్కపు చనుగవలాగ అటు గూఢత్వంగాని ఇటు చాటుదనంగాని లేకుండా ఉండాలి - అని అంటాడు ఈ కవి. ఉపమానాల్లో ఆయన రసిక ప్రవృత్తి కనపడుతున్నా ఉక్తిలో మాత్రం ఆయన కవితాశక్తి కనపడుతోంది. లక్షణానికి లక్ష్యంగా ఉందీపద్యం. పూర్వులు తాముచెప్పిన సత్యాలకు తామే దృష్టాంతాలుగా ఉండటం విశేషం.

కావ్యాన్ని కాంతతో పోల్చటం లాక్షణికుల ఆచారం. కావ్యమంతా కవిత కానక్కరలేదు. రమణీయార్థ ప్రతిపాదక శబ్దరూపమైన కవిత ఆ కావ్యంలో కొంత ఉంటుంది. అది ఆ కావ్యాన్నంతా అస్వాదయోగ్యం చేస్తుంది. కవితను నాతి శరీరంలో వక్షోజ సీమగా దర్శించిన రసికుడు పై పద్యకర్త. శ్రీనాథుడు కూడా తన కవితా లక్షణాలను చెబుతూ ఈ ఉపమాద్రవ్యాల నెన్నుకోవడం ప్రసిద్ధం. హృదయాన్ని కదిలించే రమణీయ భావం కవితను రూపుకట్టిస్తుంది. ఆ భావాన్ని అభివ్యక్తం చేసే ఉక్తిలోని శక్తి వ్యంగ్యమాధుర్యాన్నిస్తుంది. అందమైన ఆకృతి ఆస్వాదనలో అనుభూతి కవిత కుండవలసిన ప్రధాన లక్షణం. ఆకృతి అభివ్యక్తినొందుతున్నప్పుడు గూఢంగా ఉండలేదు. ఉంటే అభివ్యక్తి అసమగ్రం. ఆకృతి వాచ్యంగా ఉంటే చమత్కృతి లేదు. అది లక్షణా వృత్తినైనా ఆశ్రయించాలి. వ్యంజనా వృత్తినైనా ఆశ్రయించాలి. వాచ్యంలో చాటుదనం లేదు. లక్ష్యంలో గూఢత కొంత ఉంది గాని రమణీయ విస్ఫూర్తిలేదు, వ్యంగ్యంలో గూఢత లేదు, చాటుదనంలేదు, ఈ రెండూ లేకపోవటమే కవిత్వ లక్షణం కాదు. ఈ రెండూ లేని రమణీయాభివ్యక్తి వ్యంగ్యంలో విద్యుద్దీపాల వెలుగులో రంగం మీద పాత్రలు సాక్షాత్కారించే విధంలోనూ ఈ లక్షణం ఉంది. అందులో సూర్యకాంతిలో వెలిగే స్పష్టత ఉండక పోవచ్చు. కళలో గోపనం ఒకకళ. అత్యంత గోపనం లేకుండా ఉండటం కళలోని కళ. భావం బయట పడితే పలచనౌతుంది. గూఢంగా ఉంటే అదృశ్యమౌతుంది. దృశ్యాదృశ్యమైన అభివ్యక్తిలో భావనాశక్తి ఇమిడిఉంది. ఆలోచనామృతానికి అనుభూతికి అది ఆధారమౌతుంది. ఆంధ్రవధూటి చొక్కపుంజనుగవలీల' అన్న ఉపమానంలో తెలుగుదనం ఎంత ఉందో వెలుగుదనం అంత ఉంది.

*డిసెంబర్ 1975*



జి.వి. సుబ్రహ్మణ్యం

# అందం - ఆనందం

కలవు రసరామణీయకములు కృతులను
మాధురీ సౌరభమ్ములు మధువున బలె;
రసము లంతఃకరణ యోగరంజనములు
రామణీయక మాకర్ష రచన సరణి - రాయప్రోలు

మధువులో మాధుర్యం సౌగంధ్యం ఎలా ఉంటాయో, కావ్యంలో రసం, రామణీయకం రెండూ కలిసి ఉంటాయి. రసం హృదయానందం, రామణీయకం హృదయార్థకమైన రచనా సౌందర్యం.

ఆనందం అందం జన్యజనక సంబంధం కలిగి ఉంటాయి. అందం అంటే ఆనందం యొక్క బహిస్సాక్షాత్కార మంటాడు జార్జి శాంతాయనా. అందం మౌలికంగా వస్తు నిష్ఠం. వస్తువులోని అందాన్ని గ్రహించేది అంతరంగం. వస్తువులో అందం ఉన్నా అది ఆస్వాదింపబడనిచో దానికి అస్తిత్వం నాస్తి. రుచి వస్తువులోకంటె రుచి చూచేవానిలోనే ఉంది అంటారు అందువలననే. రుచి అభిరుచిచేత ఆస్వాదింప బడుతుంది. అలాగే అందం రసికత చేత అనుభవింపబడుతుంది. అనుభవానికీ అందానికీ సంబంధం ఆస్వాదనం. అట్టి ఆస్వాదనీయత్వమే రామణీయకత్వం. రామణీయకత్వం చేత హృదయం ఆకృష్టమౌతుంది. ఆకర్షణకు ఆకృతి మాధుర్యం మూలకారణం. ఆకృతి మాధుర్యం అంగరచన వలన కలుగుతుంది. కావ్యంలో అంగరచన అంటే విశిష్టపదరచనాత్మకమైన రీతి. రీతి రసాస్వాదనకు మార్గం. ఆ మార్గం మధువులోని సౌగంధ్యం లాంటిది. సుగంధం నాసిక నాకర్షించినట్లు, కవితలోని శబ్దరచనా సౌందర్యం శ్రవణాన్ని ఆకర్షిస్తుంది. మనస్సును రమింపచేస్తుంది. రమణంలో మనస్సు పరవశిస్తుంది. పారవశ్యంలో కలిగే ఆనందాన్ని రసానుభూతి అంటాం. అది మధువులోని మాధుర్యం లాంటిది.

మధువుకు మాధుర్యం సహజలక్షణం. అలాగే కావ్యానికి రసం జీవచైతన్యం. చైతన్యం శరీరజీవ విలాసాన్ని ఆశ్రయించి ఇంద్రియతర్పణం చేస్తుంది. రసం రామ ణీయకత్వాన్ని ఆశ్రయించి పఠితను పరవశింప చేస్తుంది. ఒకటి గమ్యం మరొకటి గమనమార్గం. అంతర్ముఖమైన అందం బహిర్గతం కావాలన్నా, బహిఃప్రకృతిలోని సౌందర్యం అంతర్ముఖమైన ఆనందంగా పరిణమించాలన్నా రచనయే రాజమార్గం. అదే ఆనందాన్ని చేరే అందమనే మార్గం.

తెలుగు కవులందుకే రసలక్ష్యాన్ని రచనలతో సాధించాలని యత్నించారు. నన్నయ మొదలు నారాయణరెడ్డిదాకా తెలుగు కవిత్వంలో రీతికొక విశిష్ట స్థానం ఉంది. శబ్దాన్ని రమణీయార్థం ద్వారా రసలోకాని కెక్కించే పదసోపానం తెలుగు కవులు తర తరాలుగా సాధించిన రమ్యాలోకం.

*జనవరి 1976*

# ప్రణయతత్వం

తీవె మీద సుతారంపు తీవి నిలిచి
పగల బడి నవ్వు పువ్వుపై కెగయు అళిని
ప్రియుడు ప్రియురాలినట్లు చేర్చెనొక సుకవి
బిడ్డ తల్లిని భాతి కల్పె మరొకండు - రాయప్రోలు

తీవెమీద పూవు తరుణశోభలతో లాస్యం చేస్తున్నప్పుడు తుమ్మెద ఝుంకారం చేస్తూ పూదేనియ నాస్వాదించటానికి దరిచేరటం ప్రకృతిలో ఒక రమణీయదృశ్యం. ఆ సన్నివేశాన్ని చూచిన కవులు ప్రియురాలి అధరాన్ని అందుకోవటానికి వచ్చిన ప్రియునిగా తుమ్మెదను భావించటం, కీర్తించటం మనకు సర్వకాలాలలో వినవచ్చే సాహిత్యసత్యం. భావకవి అదే దృశ్యాన్నిచూచి తల్లివద్ద క్షీరామృతాన్ని క్రోలడానికి వచ్చిన బిడ్డలా తుమ్మెదను భావిస్తాడని రాయప్రోలువారి ప్రవచనం. ప్రకృతిలో కనపడే ఒక సన్నివేశానికి కవి చూచే చూపునుబట్టి, భావనాబలాన్ని బట్టి పలురకాలుగా వ్యాఖ్యానంచెప్పే అవకాశం ఉన్నదన్నది మనం తెలుసుకొనే సత్యం.

కలకాలం నుంచీ పూవును ప్రియురాలుగా, తుమ్మెదను ప్రియునిగా భావించటం కవిసమయంగా కావ్యజగత్తులో సాగివస్తున్నది. దానికి రాయప్రోలు వారు కావించిన వ్యాఖ్యానం ఒక నవ్యాలోకం! మొదటిది శృంగార రసభావనకు ఆలంబనమైతే, రెండవది వత్సల రసభావనకు పతాకగా భాసిస్తోంది. శృంగార వత్సలాలకు విచిత్రమైన సంబంధం ఉంది. అది స్త్రీ సహజ ప్రకృతినాశ్రయించే యేర్పడింది. స్త్రీ పురుషుణ్ణి మనసారా ప్రేమిస్తుంది; తన సర్వస్వాన్ని అతనికి సమర్పించుకుంటుంది. ఆ సమర్పణంలోనే ప్రేమ సమగ్రత్వాన్ని సంతరించు కుంటుంది. పురుషుడు స్త్రీని తనకోసమే గ్రహిస్తాడు; తరువాత ఆమెకోసమే తన ఉనికి సార్థకమైందని గుర్తిస్తాడు. మొదట పురుషుడు స్త్రీ చెంత భోగి, క్రమంగా త్యాగి అవుతాడు. స్త్రీ పురుషుని వరిస్తుంది, రమిస్తుంది; అంతటితో ఆగదు; అతని తేజస్సును గ్రహించి సంతానంగా మార్చుకుంటుంది. బింబ ప్రతిబింబాలను చూచుకొని జన్మసార్థకం చేసుకుంటుంది. బింబంమీది వలపు, ప్రతిబింబంమీది వత్సలం స్త్రీ మనోరథానికి రెండు చక్రాలు. బింబాన్ని చేరినప్పుడు స్త్రీ ప్రణయవల్లి; ప్రతిబింబాన్ని చూచినప్పుడు కన్నతల్లి. ప్రణయవల్లి కన్నతల్లి కావటానికి పురుషుడొక యోగసాధనం. అంటే సృష్టిలో స్త్రీ ప్రకృతికి పరమార్థం మాతృస్థితిలో ఉంది. శృంగారం సాధనం; వత్సలం సాధ్యం. స్త్రీ పురుషుణ్ణి ప్రణయంతో పెంచుతుంది; బిడ్డను వాత్సల్యంతో పెంచుతుంది. ఒకనిని జీవితాన్నంతా అంకితం చేసి ఆదరిస్తుంది; ఒకరిని జీవనధార నందించి ప్రేమమూర్తిగా లాలిస్తుంది.

భావకవి వలపులోకంటె వత్సలంలోని వన్నెను గ్రహిస్తాడు. ప్రణయ పరమార్థాన్ని ప్రకృతిలో దర్శిస్తాడు. దేవిని దేవతగా ఆరాధిస్తాడు. ప్రాచీనులు స్త్రీలోని ప్రణయసూత్రాన్ని వ్యాఖ్యానిస్తే - భావకవి ప్రణయతత్వాన్ని ఆరాధించాడు!

ఫిబ్రవరి 1976

# మునిగేభక్తి - తేలేభక్తి

శ్రీ భీమనాయక శివనామధేయంబు
చింతింప నేర్చిన జిహ్వ జిహ్వ
దక్షవాటీ పురాధ్యక్ష మోహనమూర్తి
చూడంగనేర్చిన చూపుచూపు
దక్షిణాంబుధి తట స్థాయి పావన కీర్తి
చే నింపనేర్చిన చెవులు చెవులు
తారక బ్రహ్మ విద్యాదాత యౌదల
విరులు పూన్పఁగ నేర్చు కరము కరము

ధవళకరశేఖరునకుఁ బ్రదక్షిణంబు
నర్థిఁదిరుగంగ నేర్చిన యడుగులడుగు
లంబికా నాయక ధ్యాన హర్ష జలధి
మధ్యమునఁ దేలి యాడెడి మనసు మనసు

శ్రీనాథుని పద్యం చదవంగానే తెలుగువారికి 'కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ' అనే పోతనగారి పద్యం చప్పున జ్ఞాపకానికి వస్తుంది. ఆ తరువాత దానిమీద శ్రీనాథుని ప్రభావం ఉన్నదని ఊహకు తోస్తుంది. వెంటనే ఈ పద్యానికి ఆ పద్యానికి కొంత భేదముందనికూడా స్ఫురిస్తుంది. ఆ భేదమేమిటి?

రెండు పద్యాలూ భక్తిరస వ్యంజకాలే. కాని శ్రీనాథుడు చెప్పేపద్ధతిలో రాజసం రాగిస్తున్నది; పోతనకవితలో పారవశ్యం లాస్యం చేస్తున్నది. వస్తుతత్వం ఒకటే అయినా కవి వ్యక్తిత్వాన్నిబట్టి కవితలో భేదం కనవస్తున్నది. సీసపద్య పాదాలను సమ విభక్తంచేసి పూర్వార్థంలో భీమేశ్వరాకృతిని సమాస ఘటనంతో సాక్షాత్కరింపచేసి ఆ మూర్తిని అర్చించాలని ఆదేశిస్తున్నట్లున్నది శ్రీనాథుని సీసం. పోతన్నగారి సీసం పురుషోత్తముని పేర్లుచెప్పి సంకీర్తనం చేస్తున్నట్లున్నది. లాటాను ప్రాసాన్ని పదాంతాల్లో నిలిపి పద్యానికి తూగు శ్రీనాథుడు కల్పిస్తే, పోతన ప్రతిపాద ఖండాంతంలోనూ నిల్పి; పునరావృత్తిని ద్విగుణీకృతంచేసి భక్తిమత్త చిత్తవృత్తిని వ్యంజింపచేశాడు. శ్రీనాథుని శైలిలో భక్తి మునిగిపోతుంది! పోతనగారి శైలిలో భక్తి తేలియాడుతుంది.

> కవిత్వాన్ని వ్రాయటం వేరు. చదవటం వేరు, అధ్యయనం చేయటం వేరు. అధ్యయనమంటే గ్రుడ్డిగా ఆరాధించటంకాదు. అసలైన తత్వాన్ని అన్వేషించటం. అన్వేషించటం మరలారెండు విధాలు. ఒకటి. తాను కోరుకున్నది కవిత్వంలో ఉందా లేదా అని తరచి చూడటం రెండు. కవితలో ఉన్నపరమార్థాల్ని సమతతో చూడటం. - జి.వి.యస్. (సాహిత్యాధ్యయనం)

మార్చి - ఏప్రిల్ 1976

# నైవేద్యం

ప్రతి దినము నీగుణగీతములు
మధురముగ నేను పాడెదను;
నీవు నాకు మాటల నిమ్ము
నీవు నాకు స్వరము నిమ్ము

నీవు ఉండునెడల మనసున
వికచ కమలాసనమున
నీవు నా ప్రాణమును - నీ ప్రేమతో నింపిన
మధురముగ నేను పాడెదను

రవీంద్ర కవిత్వానికి ఆంధ్రావతారం కల్పించడమే కవితాతపస్సుగా భావించిన డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారి భక్తి గీతమిది. మనస్సొక వికసించిన పద్మం. ఆ పద్మంలో వసించేది ప్రభువు. ఆయనతత్వం ప్రేమ. ఆ ప్రేమ ప్రాణాన్ని పరిపూర్ణం చేస్తుంది. ప్రేమపూర్ణమైన ప్రాణం పద్మంలోని మకరందం. దాని గుణం మాధుర్యం. ఆ మాధుర్యం ప్రభువుకు నివేదించే నైవేద్యం.

ముకుళిత కమలంలో మకరందం గుప్తమైపోతుంది. వికసిత కమలంలో అది ప్రకటితమౌతుంది. మనసులోని మాధుర్యాన్ని మనోజ్ఞంగా ఆవిష్కరించే మహనీయ ప్రవృత్తి వికాసశీలం. పద్మం వికసిస్తుంటే ఆత్మసౌరభం గుబాళిస్తుంది. ఆ సువాసనలో సువ్యక్తమయ్యే కొంగ్రొత్తరుచి కవితాసూక్తి. ఆ సూక్తిలోని మాధుర్యం భక్తి.

కమలంలోని మకరందాన్ని ఆస్వాదించేది తుమ్మెద. తుమ్మెద మకరందాస్వాదనం కోసమే కమలాన్ని ఆశ్రయిస్తుంది. మకరందం ఆస్వాదింపబడినప్పుడే సార్థకమౌతుంది. లోకంలో వికీచకమలాసనం మీద మధుపాన మత్తుడయ్యేవాడు తుమ్మెదటేడు. మరి మనోలోకంలో కమలంలో వసించేవాడు ప్రభువు. ఆ ప్రభువుకు ఆశ్రయం భక్తుని హృదయం. అతనికాభక్తుని హృదయ కమలం నైవేద్యం! భక్తిలేనిదే భగవంతునికి భుక్తిలేదు.

మాధుర్యం మనస్సుకు భక్తివలనా వస్తుంది; రక్తివలనా కలుగుతుంది. రక్తి ప్రణయంవల్ల ఏర్పడితే; భక్తి ప్రేమవలన జనిస్తుంది. ప్రేయసి ప్రియదత్తమైన చిత్తరతిని పరిపక్వంచేసుకోవటమే రక్తిమాధుర్యం. భక్తుడు భగవద్దత్తమైన మనోరతిని మననం చేసుకోవటమే భక్తిమాధుర్యం. మాధుర్యం గుణం. ఆ గుణం సాధకుడైన భక్తుని హృదయంలో ఉన్నా సాధ్యుడైన భగవంతుని గుణరూపంగా భాసిస్తుంది. అది కవి హృదయంలో కవితగా రూపొంది గీతంలా ఆవిష్కృతమౌతుంది. ఆ గీతంలోని మాట మాధుర్యం ప్రసరించేబాట! అందులోని స్వరం హృదయవికాస చైతన్యస్పనం. ఆ చైతన్యం ప్రేమపూర్ణమైన ప్రాణస్పందనం. హృద్యమైన గీతరసాయనం హృదయేశుని నైవేద్యం!

'పలికెడిది భాగవతమట! పలికించెడివాడు రామభద్రుండుట!' అన్న పోతనగారి భక్తి మాకందంలోని రుచి యేమాధుర్యాన్ని అందించిందో 'నీవు నా ప్రాణమును - నీ ప్రేమతో నింపిన - మధురముగ నేను పాడెదను' అన్న రెడ్డిగారి భక్తిగీతంలోని శ్రుతిగూడా ఆ మాధుర్యాన్నే ఆంధ్రుల కందిస్తున్నది.

*మే 1976*

జి.వి. సుబ్రహ్మణ్యం

# శ్రవణం - మననం

*నీ మాధుర్యం నన్ను బంధించి ఉంచకుండును గాక*
*నీ ఐశ్వర్యము వైపుకే అది నన్ను లాగుచుండును గాక*

బెంగాలీ 'నైవేద్య' కావ్యంలో రవీంద్రులు భగవంతుని సంబోధిస్తూ ఆత్మనివేదనం చేస్తున్నట్లుంటే డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారు తెలుగుకైతలో అంతర్వర్తియైన గురుదేవుణ్ణి, సర్వవ్యాపియైన సర్వేశ్వరుణ్ణీ కలిపి పిలుస్తున్నట్లుగా ఉంటుంది. రెడ్డిగారి ప్రతిభానేత్రం విశ్వకవి కవితా వాతాయనంలోంచి విశ్వేశ్వరుణ్ణి విలోకిస్తుంది.

శాంతినికేతనంలో అంతేవాసిత్వం నెరపేరోజుల్లో రెడ్డిగారు రవీంద్రగీతాలను విన్నారు. స్వయంగా తన్మయులై ఆలపించారు. బెంగాలీ రచనలోని రాగమాధుర్యం వారిలో కల్పించింది శ్రవణానందం. దానికి తెలుగులో వారు చేసింది మననం. అందువల్లనే గురుదేవులది తాళలయలను మన్నించిన గేయరచన అయితే - రెడ్డిగారిది అంతర్లయను అలవరచుకొన్న వచనరచనగా రూపొందింది.

గురుదేవుల గీతాల్లోని గతివిలాసం బహిరలంకార శృంగారం, అది రచనలోని భావాల కబ్బిన వేషాలంకరణం. రెడ్డిగారి దృష్టి ఆకృతిసౌందర్యం మీద ప్రసరించినంతగా అలంకారవిలాసం మీద వ్యాపించదు. రచనకు ఆకృతిసౌందర్యం శబ్దార్థాలవల్ల ఏర్పడుతుంది, వేషాలంకారం ఛందోగతివల్లా, శబ్దార్థాలంకారవల్లా వస్తుంది. ఆడంబర వేషాలంకరణాన్ని ఆమోదించని రెడ్డిగారు రాగరంజితమైన గతివిలాసాన్ని అనువాదంలో గ్రహింపలేదు. కాని, మూలంలో ఉన్న అర్థగాంభీర్యాన్నీ, శబ్దవిన్యాసాన్నీ అనువైనచోటల్లా బింబప్రతిబింబ భావంతో అనువాదంలోకి అవతరింపజేశారు.

గురుదేవుల రచనలోని గేయవృత్తి భావావేశాన్ని కల్పించటానికి తోడ్పడుతుంది. రెడ్డిగారి రచనలోని వచనప్రవృత్తి ఆలోచనను వికసింపచేయటానికి ఆలంబనమౌతుంది. మూలంలోని గేయావేశం అనువాదంలో ఆలోచనామృతంగా అవస్థాంతరం చెందుతున్నదన్నమాట! గురుదేవుల రచనలో అంతర్ముఖీనమైన రాగలయకు బాహిరమైన రచనాభివ్యక్తి జరిగితే - రెడ్డిగారి అనువాదంలో మూలరచనాభివ్యక్తిని అంతర్ముఖీనంగా ప్రవహింపజేసికొని ఆత్మీయతాముద్ర వేసికొనే వచనరచనానిముక్తి రూపుకట్టింది. పై గేయవాక్యాల్లోని తాత్పర్యాన్ని గురుదేవులపరంగా అన్వయిస్తే రెడ్డిగారి రచనలోని ఈ రహస్యం బోధపడుతుంది. 'కర్మక్షేత్రమున సక్షమ స్వతంత్రుడనుకానిమ్మ' అని చేసిన ప్రార్థన సార్థకమే అనిపిస్తుంది. ఇక్కడ కవి కర్మ కావ్యం; కర్మక్షేత్రం అనువాద కావ్య నిర్మాణం; క్షమ మూల తాత్పర్యం; స్వతంత్రత రెడ్డిగారి వచనరచనా ప్రక్రియ.

తెలుగులో తనదైన ఒక నిష్ఠ, ఒక లక్ష్యం, ఒక శైలి, ఒక ప్రస్థానం అనువాదంలో కూడా అచంచలంగా నిలుపుకొన్న సాహితీ తపస్వి డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారు.

*జూన్ 1976*

# బొమ్మ - బ్రహ్మ

భక్తి మదధార నేను కోరుట లేదు ప్రభూ!
ఇమ్ము భక్తి శాంతిరసమును
స్వచ్ఛసుధతో మంగళకలశమును నింపి
నా భువన భవన ద్వారమున

- డా॥ బెజవాడ గోపాలరెడ్డి

ఈ గేయంలో ఆయువుపట్టైన మాటలు రెండున్నాయి. 'భక్తి మదధార', 'భక్తి శాంతిరసం'. ఈ రెండూ గడుసు ప్రయోగాలే. బహుశః బెంగాలీ పలుకుబడికి ప్రతిబింబాలేమో! తెలుగులో మాత్రం చిత్రంగా కనిపిస్తున్నాయి. భక్తికీ మదానికీ చుక్కెదురు. మరి భక్తిలో మదం ఎప్పుడుంటుంది? మదమంటే అహంకారం, గర్వం. అహంకారం అజ్ఞాన విలసితం అయినప్పుడు జ్ఞానవిరహితమైన భక్తి కాని, మూఢభక్తిగాని ప్రవాహంగా పొంగినప్పుడు 'భక్తిమదధార' అనిపించుకుంటుంది. దీన్ని ఈ అర్థంలోనే కాక ఆడంబర భక్తిప్రదర్శమనే అర్థంలో కూడా కవి వాడినట్లు కనపడుతుంది. 'ఏ నీ భక్తిని గొని, గాంభీర్యము విడనాడి, తటాలున నృత్యగీత బృందగానముల, భావోన్మాద మత్తతలయందు విహ్వాలు లగుదురో, అట్టి జ్ఞానరహితుల వెర్రిగ పొంగు నురుగుల సమమగు భక్తిమదధార నేను కోరుట లేదు ప్రభూ!' అంటారు రవీంద్రుని గొంతుకతో డా॥ గోపాలరెడ్డి గారు. భక్తిభావోన్మత్తచిత్తంతో బాహిరమైన ప్రదర్శనాలతో ప్రపంచించే భక్తిని జ్ఞాని కోరడు. భక్తి భావాశ్రు పూరాన్ని కన్నుల్లో నింపుకొని అప్రమత్తగంభీర చిత్తంతో పరిపూర్ణమై వేడియెరుగని వెలుగును ప్రసాదించే భక్తిశాంతిరూపాన్ని జ్ఞాని కోరుకుంటాడు. ఇక్కడ 'శాంతి' అంటే అహంకార శమనం, ఆడంబరరాహిత్యం, అంతర్ముఖీనత్వం. 'రస' మంటే అనుభూతి. భగవంతుడూ తానూ వేరుకాదనే తెలివితో కూడిన అద్వైత స్థితి. భక్తి నిరహంకారం, నిరాడంబరం అయిన చిత్తంలో రసత్వాన్ని భజిస్తే శాంతిరసం అవుతుంది. శాంతిరసానికీ, శాంతరసానికీ భేదం ఉంది. బౌద్ధులు శాంతాన్నే శాంతిరసమంటారట! కాని, లాక్షణికులు దాన్ని అంగీకరింపరు. నిరహంకారమైన భగవద్రతి ఇందులో ఉంది; నిర్వికారమైన ఆత్మరతి అందులో ఉంది.

ప్రియుల్లాగానే భక్తులు రెండువిధాలు. కళ్లు తెరిచి వొళ్లువిరుచుకుంటూ, గొంతు చించుకొనేవారు ఒకవిధం, కళ్లుమూసుకొని అహం చంపుకొని వెలుగు నింపుకొనే వారు మరొకవిధం. కళ్లుతెరచుకుంటే కనబడేది బొమ్మ; కళ్లు మూసుకుంటే కనపడేది బ్రహ్మ!

*జులై 1976*

# అంతరార్థం - పరమార్థం

'కవి తన గానమున పలికిన మాటలకు
నానాజనులు నానార్థముల లాగి గైకొనెదరు
నీ వైపుకే పరుగిడుచుండును దాని అంతరార్థము! - డా॥ బెజవాడ గోపాలరెడ్డి

నదీమతల్లులు తమ నిండు జీవనాన్ని లోకహితాని కర్పించుకొంటూనే భగవంతుని చరణములమ్రోల జలాంజలి రూపంగా పడి సార్థకం చేసుకుంటున్నవి. పూలబాలలు తమ పరిమళాలతో సమస్త ప్రపంచాన్నీ సుగంధ బంధురం చేస్తూనే భగవంతుని చరణాలపై వ్రాలి తమ జన్మలు ధన్యములనుకుంటున్నవి. ఈ నదీకుసుమ జీవితాలతో ఇహాని కెంత విలువ ఉందో పరానికంత ప్రాధాన్యం ఉంది. ప్రభువు ప్రజకు నిండు జీవితాన్ని ప్రసాదించాడు. జీవితం మిథ్య అనుకోవటం పలాయనవాదం. అయితే లౌకిక జీవితమే పరమార్థ మనుకోవటం పరమ అవివేకం. లోకహితార్థం జీవిత పరమార్థం అయినప్పుడు జీవితంలో స్వార్థం లేని సేవాధర్మం జీవనమకరందంలా రుచుల నీనుతుంది. ఆ సేవ ఎవరికి? ప్రపంచానికి - ఈ ప్రపంచం ప్రభువు మన సేవల నందుకోవటానికి కల్పించిన బహిరర్చనాకల్పం. విశ్వవ్యాప్తమైన అతని విరాణ్మూర్తిని చూడటమే జీవితంలోని వివేకం. విశ్వంలోనే విశ్వాత్ముణ్ణి చూడాలి. ఆ చూపుకు విశ్వమే ఆలంబనం, అందుకే అంటారు 'రవీంద్రులు' విశ్వమును వంచిత మొనర్చి కాదు నీ పూజ!

కవికూడా నదివంటివాడే, కుసుమం వంటివాడే. అతడు కవితా గానం చేస్తాడు. అతడు ప్రకృతిని వర్ణిస్తాడు. అందులోని అందాన్ని ఆరాధిస్తూ కీర్తిస్తాడు. కవి చూచిన అందం ప్రకృతిలోని పరమార్థం. తాత్త్వికులు చెప్పే సత్యం కవికి సౌందర్యంగా దర్శనమిస్తుంది. దాన్ని సుందరంగా ఉక్తిమయంచేసి ఉల్లేఖిస్తాడు. సామాజికులకది నానార్థరుచిని కలిగించి ఆలోచనామృతాన్ని అందిస్తుంది. కవితలో దర్శనముంది, ప్రదర్శనముంది. ప్రదర్శనలో నానార్థాల అనేకత్వం ఉంది. దర్శనంలో పరమార్థంలోని ఏకత్వం ఉంది.

నిజానికి సౌందర్యమే సత్యం, సత్యమే సౌందర్యం. సగుణమైన సత్యం సౌందర్యం, నిర్గుణమైన సౌందర్యం సత్యం. సత్యం పరమార్థం, సౌందర్యం అంతరార్థం. అంతరార్థమే పరమార్థమని తెలుసుకోవటం పరమ పురుషార్థం!

> తెలుగు వారికి అహంకారం కంటే ఆవేశం యెక్కువ. దీనివల్ల మన జాతికీ, సాహిత్యానికీ జరిగిన మేలెంతో హానీ అంతే కనబడుతోంది. కొత్త ఎక్కడైనా కనబడితే చాలు కో అనికూస్తారు. కోటి గొంతుకలెత్తి కోలాటం చేస్తాడు. ఏడడుగులు నడిచింతరువాత తటపటాయిస్తాడు. ఇంతలో ఒక కొత్త కేక వినపడితేచాలు తన వారిని నట్టేట ఉంచి మరో తిప్పమీదికి దూకి పోతాడు. కొత్తొక వింతగా సాగే తెలుగు వారి సాహసయాత్రలో పాతలు పల్టీలు కొట్టటం, నేతలు పార్టీలు మార్చటం నిత్యనూతనాధ్యాయమై సాగిపోతున్నది. - జి.వి.యస్. (మహతి)

ఆగస్టు 1976

# నిత్యం - సత్యం

స్య సూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం
కవీనాం కో దోష స్తతు గుణగణానా మవగుణః
యదేతై ర్నిశ్శేషై రపరగుణలుబ్ధై రివ జగ
త్యసావేక శ్చక్రేసతత సుఖ సంవాస వసతిః - జయదేవుడు

రఘురాముని గుణకీర్తనం చేయటం కవుల దోషం కాదట? రాముని గుణగణదోషమేనట అవును మరి. 'గుణాః పూజాస్థానం గుణిషు నచ లింగం నచ వయః' అని కదా ఆర్యోక్తి!

మనిషిలోని మంచితనాన్నికీర్తించటం మానవనైజం. అది దోషమన్నా గుణమే. బలహీనత అనుకున్నా ప్రశంసాపాత్రమే. 'మంచి అన్నది పెంచుమన్నా' అన్న మానవతా వాది మంచితనానికి మానవాకృతి గాంచిన మనిషిని మన్నించకుండా మానలేడు. అడవుల పాలై గూడా ఆర్తజనులను రక్షించిన వాడు రాముడు. అమలిన ధర్మంతో ఆత్మసుఖాన్ని కోల్పోయినవాడు రాముడు. బలమున్నది కదా అని బలహీనులను హింసించనివాడు రాముడు. ఆయన అయోధ్యలో ఉన్నా అడవుల్లో ఉన్నా ధర్మాన్ని ఆయన రక్షించాడు; ధర్మం ఆయన్ను రక్షించింది.

రాముడు కోదండపాణి. కోదండం దుష్టశిక్షణకూ, శిష్టరక్షణకూ సంకేతం. అతని కోదండ పాండిత్యమే అతనికి కల్యాణం చేకూర్చింది. స్వీయకల్యాణానికి చేతిలో పూనిన కోదండాన్ని లోకకల్యాణానికి ఉపయోగించాడు రాముడు. జగత్కంటక నివారణమే కోదండ విద్యాసాగరం. శిష్టులనూ, బలహీనులను, సంరక్షించుటయే కోదండధర్మం. రామ సింహాసనం రాజ్యకాంక్షకు ప్రతీక కాదు. ప్రజారక్షకు ప్రాతిపదిక. రాముడు రాజుగా ప్రసిద్ధికెక్కిన వాడు కాడు, ప్రజారక్షకు రాజధర్మంగా వెలుగొందినవాడు. వ్యక్తి స్వార్థపరుడైతే వ్యక్తిగా నిలుస్తాడు, అతడే ధర్మస్వరూపుడైతే ఆదర్శ ప్రాయుడుగా వెలుగొందుతాడు. ప్రజలకోసం బ్రతికిన రాముడు ప్రజాశక్తికి ప్రతీక. అందువల్లనే రాముడు సుగుణాభిరాముడైనాడు.

గుణకీర్తన మంటే సార్వకాలీనమైన ధర్మప్రశంస. మానవ సమాజాభ్యుదయ చరిత్రలో వ్యక్తి నిమిత్తమాత్రుడు; అతడు సాధించే ధర్మం నిత్యం! అదే అన్నికాలాలలో కీర్తింపబడే సత్యం!

> మానవప్రవృత్తి గుణాలమీద ఆధారపడి ఉన్నట్లే, సాహిత్య విమర్శ ప్రవృత్తి కూడా ఆకృతి, ఆలోచన, అనుభవం అనే మూడు అంశాలతో ముడిపడి ఉంటుంది. ఆకృతిలో రూపం, ప్రక్రియ, రచన మొదలైన అంశాలుంటాయి. ఆలోచనలో సిద్ధాంతం, దృక్పథం మొదలైనవి పరిగణింపబడతాయి. అనుభూతికి కళాతత్త్వ సౌందర్య దర్శనం ముఖ్యం.
>
> - జి.వి.యస్. (ఆంధ్ర సాహిత్య విమర్శ - ఆంగ్లప్రభావం)

సెప్టెంబర్ 1976
జి.వి. సుబ్రహ్మణ్యం

# నీవే సమాజం

*ఒరు లే మేమి యొనర్చిన*
*నరవర! యప్రియము దనమనంబున కగుఁదా*
*నొరులకు నవి సేయకునికి*
*పరాయణము పరమధర్మపథముల కెల్లన్* - మహాభారతం

ఇతరులు ఏయే పనులు చేస్తే మనకు ప్రియాలు కావో వాటిని మనం ఇతరులపట్ల చేయకుండా ఉండటం ఉత్తమధర్మ ముంటున్నది మహాభారతం. ఈ మాటను ఏ మతాల వారైనా ఏ సిద్ధాంతానుయాయులైనా, ఎంత అభ్యుదయ వాదులైనా, కాదనరని అనుకుంటాను. సార్వజనీనం, సార్వకాలికం అయిన ధర్మసూత్రమిది.

ఇందులో రెండంశాలున్నాయి. ఒకటి మనిషి 'ఆత్మవత్సర్వభూతాని' అన్న వాక్యతాత్పర్యాన్ని దర్శించి ఆచరణలో పెట్టాలి. అప్పుడే అది సాధ్యం. మనుషులందరూ ఇతరుల సుఖాల్లో భాగం పంచుకోవటానికి వెనుకాడరు కాని, దుఃఖంలో పాలుపంచుకొనే వారెందరో ఉండరు. అలాగే ఇతరుల కష్టాలను గురించి సదవగాహనంతో సానుభూతి చూపేవారూ కొద్దిమందే ఉంటారు. ఒకడు తాను ముందు కష్టపడితే ఇతరుల కష్టాన్ని తెలుసుకోగలడు. ఆ కొన్నవాడే ఆకలిబాధను తెలుసుకోగలడు. అలాగే ఇతరుల వలన బాధపడినవాడే ఇతరులకు తనవలన కలిగే బాధను గురించి అంచనా వేయగలడు.

ఇక రెండవ అంశం. లోకంలో పాలకులు పాలితులు ఉన్నారు. వర్గసంఘర్షణ సిద్ధాంతం ప్రకారం ఒక కాలంలో పాలకులచేత పాలితులు పీడింపబడతారు. పీడితులు తిరుగుబాటు చేస్తారు. పీడితులు పాలకులైననాడు, వారికి పూర్వం తాము పీడింపబడినవిధం తెలుసు కాబట్టి తాము తమపాలితులను పీడించకుండా పాలనం చెయ్యాలి. ఇలా పరపీడనం లేకపోతే వర్గసంఘర్షణ ముండదేమో!

నిజానికి మనిషి ఈ సహనాన్ని సాధించటానికి ఎంతో సాధనం చెయ్యాలి. మనిషి తనకోసమే లోకాన్ని చూస్తాడు. ముందు తాను బ్రతికితే, తరువాత సమాజమంటాడు. పై ధర్మంలో తనలాంటిదే సమాజమనే అర్థముంది. తాను బ్రతకటం మనిషికెంత ప్రాధమికమైన ధర్మమో తనలాగా సమాజాన్ని బ్రతకించటం కూడా అతనికి అది ధర్మమౌతుంది. ఆత్మకూ సమాజానికి అభేదాన్ని పాటించమనే అమూల్యధర్మం పై పద్యసారం. స్వార్థంకోసం కోరుకునేహితం పరార్థానికి కూడా వర్తింపజేయమంటుంది ఈ మానవధర్మం. నీవే సమాజమంటుంది ఈ నిర్మల ధర్మం!

*జనవరి 1977*

# సంక్రాంతి

*క్షితిపయి వట్ట్రిమ్రాఁకులుఁ జిగిర్ప వసంతుఁడు దా రసోప గుం*
*భిత పదవాసనల్ నెఱప, మెచ్చక చంద్రుఁడు మిన్నున్ బ్రస*
*న్నతయును సౌకుమార్యము గనంబడ ఱా ల్గరగంగఁ జేసె; నే*
*గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా!*

విజయవిలాసంలో సాయంకాల వర్ణన సందర్భంలో చేమకూర వేంకటకవి రచించిన ఈ పద్యం రసికులైన తెలుఁగువారి నోట తరచుగా వినవస్తుంది. వసంతుడు శిశిరఋతువులో మోడువోయిన చెట్లను చిగిరింప చేస్తాడు. అవి పాలతో నిండిన ఆకులనూ, పూవులనూ తాల్చి సువాసనలు వెదజల్లుతాయి. నీరసమైన ప్రకృతిని నవనవోన్మేషంగా వికసింపజేసి రమణీయ భావాలతో రాగరంజితం చేసే రచనాశిల్పం వసంతుడు వెలయించాడు. చంద్రుడు దాన్ని మెచ్చలేదు. అతడు పండువెన్నెలలో ఉన్న ప్రసాద సౌకుమార్యాలతో రాళ్ళను కూడా కరగించివేశాడు. శిలలను సైతం ద్రవింపచేసే రచనాశిల్పం చంద్రునిది. వసంతునిది మనస్సును వికసింపజేసే రచన; చంద్రునిది మనస్సును ద్రవింపచేసే రచన. ఒకటి అనుభూతిని ఆలోచనతో రమింపచేసే రచన; మరొకటి ఆలోచనను అనుభూతిలో అంతర్భవింపజేసే రచన. మొదటిది ప్రకృతిని వర్ణించే రచన; రెండవది భావాంబర వీధిలో విహరింపజేసే రచన. ఒకదానికి భావనం ప్రధానం; రెండవదానికి రమణం ప్రధానం. ఇటువంటి రచనలు సమకాలికులైన కవులు చేస్తే ఒకరి రచనను మరొకరు మెచ్చకపోవటం లోకసహజం. అటువంటి లోకప్రవృత్తిని అర్థాంతరన్యాసాలంకారంలో అందగింపజేశాడు కవి. అందువల్ల అసలు పద్యభావంకంటె అర్థాంతరన్యాసమే అందరినీ ఆకర్షిస్తోంది.

చెట్లూ చేమలూ, రాళ్ళూ రప్పలూ అన్నీ నేలమీద ఉండేవే. సమాజంలో కనపడే సహృదయ చైతన్యాన్ని చిత్రంగా రూపించాడు చేమకూర పై పద్యంలో. మోడుపోయిన చెట్లు ఒకప్పుడు చిగిర్చినవే. వాటికి చిగిర్చే సంస్కారం సహజంగా ఉంది. ఒక సమాజం కూడా సహజంగా చైతన్యవంతమైనదైనా ఒక్కొక్క కాలంలో సహజ చైతన్యం కోల్పోయి స్తబ్దత పొందుతుంది, దానికి నూత్నచైతన్యం కావాలి. ఆ చైతన్యం కోల్పోయి వాసనలు గుబాళించాలి. ఆ క్రొత్త వాసనలనే మనం అభ్యుదయ మనవచ్చు. అభ్యుదయ రచనల్లో అనుభూతితో పాటు క్రొత్త ఆలోచనా విధానం పొంగులు వారుతుంది. అయితే దానిలో రచనాశిల్పంకూడా ఉంటుంది. శిల్పం తెలిస్తే చిత్తం చివురిస్తుంది. అందరికీ అందుబాటులో ఉండే రచన దానికంటే భిన్నమైంది. ప్రసాద సౌకుమార్యాలతో ప్రజలను రంజింప చేస్తోంది. ఇది రంజనం వరకే ఆగిపోతే ఆలోచన పుట్టింపదు. రచన తన్మయత్వాన్ని మాత్రం కలిగిస్తే సమాజంలో రసికభావం రాణించవచ్చునుగాని, నూత్నభావోత్తేజాన్ని రగల్పలేదు. సమాజాన్ని వికాసమార్గంలో నడిపేదే సాహిత్యం. తన్మయత్వానికి సంగీతం చాలు. రాళ్ళను కరిగించటం సంగీతం చేసేపని. సంగీతం కంటె సాహిత్యం రెండాకులెక్కువ చదివింది. ఆ రెండాకులే చైతన్య ప్రబోధం, రచనాశిల్పం. అనుభూతి సాహిత్య ప్రకృతి; ఆలోచన దాని ప్రవృత్తి; రచన దాని సహజ సంపత్తి. ప్రకృతి లేకపోతే వికృతి అవుతుంది; ప్రవృత్తి లేకపోతే చైతన్యం నశిస్తుంది. సంపత్తు లేకపోతే జీవితం విపత్తులపాలౌతుంది. విపత్తులేని ప్రవృత్తి సాహిత్యానికి విక్రాంతి. అది ఉన్నప్పుడే లోకానికి సంక్రాంతి!

*ఫిబ్రవరి 1977*



జి.వి. సుబ్రహ్మణ్యం

# కాంతి శాంతి

సమత నా తల్లి - సౌహార్దం నా తండ్రి
అనాది నా జననం - అనంతం నా పయనం
విశ్వం నా ఊరు - శాంతి నాపేరు

పద్మశ్రీ డా॥ సి. నారాయణరెడ్డి గారు తేజస్సే తపస్సుగా చేసి దర్శించిన సత్యమిది. శాంతికున్న ఊరూ పేరూ అందరికీ తెలిసినవే. తల్లిదండ్రుల వివరం తెల్లంచేశారు రెడ్డిగారు. శాంతికి సమత తల్లి; సౌహార్దం తండ్రి, సౌహార్దం హార్దికం. సమత ఎంత హార్దికమో అంత ఆర్థికం కూడా. మనోలోకంలో మనలేని సమత మానవ జీవితంలో మనుగడ సాగించటం కల్ల. సమసమాజం మానవజాతి సాధింపదలచుకొన్న ఒక మహత్తర లక్ష్యం. ఆ వైపుకు పయనం ఆగకుండా సాగుతూనే ఉంది. ఆ పయనంలో ప్రభవిల్లిందే శాంతి. శాంతి ఎప్పుడు పుట్టిందో అప్పుడే దాని కొక రూపం, ఆత్మచైతన్యం ఏర్పడి ఉండాలి. సమాజవ్యవస్థలో కుదురుకొనే ఆర్థిక సమానత్వం భౌతికరూపమైతే, సమాజ చైతన్యంలో సముద్భవించే సహజీవన భావం ఆత్మగుణమౌతుంది. సహజీవన సమతాభావాలకు సౌహార్దం పాదు. అందుకే అది శాంతికి తండ్రి. తండ్రి భావరూపుడు; తల్లి భౌతిక రూపం. తల్లిదండ్రుల లక్షణాలను ముద్రించుకొన్న ఉభయరూప శాంతి.

శాంతి పుట్టింది అనాదిలో. పుట్టటం ఆదికి లక్షణం. అనాది జననం కావటం శాంతికి విశేషం. అనాది శబ్దం లక్ష్యార్థంలో ప్రాచీనకాలమని స్ఫూర్తినిస్తుంది. కాని ఆ లక్ష్యం కూడా ఇక్కడ ఉపలక్ష్యం కాదు. శాంతిలో నుంచి సృష్టి పుడుతుంది. శాంతికోసం జీవిస్తుంది; శాంతిలోనే లయిస్తుంది. పుట్టుకకు ముందుండి, పుట్టింతరువాత జీవించి, గిట్టిన తరువాత కూడా నిలిచేది శాంతి. పుట్టుక శాంతియొక్క అభివ్యక్తికి సంకేతం. పుట్టిన తరువాత గిట్టటం దాని లక్షణం కాదు. ప్రగతి దాని ప్రవృత్తి. అందుకనే 'అనంతం నా పయనం' అన్నది.

అనంతగతిని గుర్తించటమే అభ్యుదయ శీలం; ఇక్కడికే అభ్యుదయమని గిరులు గీయటం సంకుచిత దృక్పథం. అనాదిలోనే నేటికి పునాది ఉన్నదని గమనించటం, అనంతంగా సాగే పరిణామం ఆగిపోయేది కాదని గుర్తించటం, అఖండంగా నిలచే శాంతి అనంతమైన విశ్వచైతన్యానికి జీవమని సంభావించటం తేజస్సు తపస్సుగా భావించే మనీషుల లక్షణం! తేజస్సు తపస్సైతే కాంతి శాంతి! (కామ్యత ఇతి కాంతిః - కోరబడుచున్నది కాంతి)

> పత్రికా రచనకు పాండిత్యం అవసరం లేకపోవచ్చు. కాని పరిణత సంస్కారం కావాలి. అది ఏ ఒక్కరంగంలో ఉన్నా రచయిత ఇరుకులో పడతాడు. ఇరుకుల్లేనిమనస్సును పెంచుకుంటే, ఇలా తలమంతా, దృగ్వలయంలో మసలుతుంది. మనిషిచుట్టూ అది ప్రదక్షిణం చేస్తుంది. ఆ మనిషిని ఆ వలయంలో విలువకట్టే విజ్ఞానముంటేచాలు పత్రికను ప్రజాహృదయానికి ప్రతిధ్వనిగా ప్రతిబింబింపచేయవచ్చు.
> - జి.వి.యస్. (గోరా శాస్త్రీయం)

మార్చి 1977

# ఉభయ సంధ్యలు

*యాత్యేకతో స్తశిఖరం పతి రోషధీనా*
*మావిష్కృతోరుణ పురస్సర ఏకతోర్క:*
*తేజోద్వయస్య యుగప ద్వ్యసనోదయాభ్యాం*
*లోకో నియమ్యత ఇవాత్మ దశాన్తరేషు* - *అభిజ్ఞాన శాకుంతలము*

కాళిదాస మహాకవి ప్రభాతకాలాన్ని ప్రతిభావంతంగా చిత్రించాడీ శ్లోకంలో. ఒకవైపు చంద్రుడు అస్తపర్వత శిఖరాన్ని చేరుతున్నాడు. మరియొక వైపు సూర్యుడు అరుణ పురస్సరుడై తూర్పు కొండపై ఉదయిస్తున్నాడు. ఈ రెండు తేజస్సుల స్థితి లోకంలో నియతంగా కనపడే విరుగు పెరుగుదలకు దృష్టాంతాలుగా కనపడుతున్నాయి. రాత్రి సహజంగా చీకటి మయం. దానిలో వెలుగు నింపేవాడు చంద్రుడు. వెలుగులరేడైనా చంద్రుడు చీకట్లను సమూలంగా చీల్చలేడు. వెన్నెల ఎంత ఆహ్లాదకరమైనా చీకటి భయం మాత్రం రాత్రిని పీడిస్తుంది. ఈ పీడనుండి విడుదలకల్పించి లోకానికి వెలుగునిచ్చే వాడు సూర్యుడు. అందువల్లనే అరుణోదయవేళ కంత ఆహ్వానం! లోకంలో పెరుగుట విరుగుటకొరకే అనీ, మార్పు ప్రకృతిధర్మమనీ భావింపబడటం ఇందులవల్లనే. కాళిదాస మహాకవి రఘువంశములో కూడా ఈ భావాన్ని రమణీయంగా చెప్పాడు.

*'తావుభావపి పరస్పరస్థితౌ వర్ధమాన పరిహీన తేజసౌ*
*పశ్యతిస్మ జనతా దినాత్యయే పార్వణౌ శశిదివాకరా వివ'.*

మేఘసందేశంలో ఇట్టి భావాన్నే సుఖదుఃఖాల కన్వయించి పేర్కొన్నాడు కాళిదాసు. చక్రనేమి క్రమంలో సుఖదుఃఖాలు ఉచ్చనీచగతులను పొందుతుంటా యంటాడు.

*కస్యాత్యంతం సుఖ మపనతం దుఃఖ మేకాన్తతో వా*
*నీచైర్గచ్ఛ త్యుపరిచ దశా చక్రనేమి క్రమేణ.*

ఒక్క ఉదయ సంధ్యయే కాదు ఈ సత్యాన్ని ఉపదేశించేది. ఉభయ సంధ్యలూ ఈ సందేశాన్ని లోకానికి వ్యంగ్యంగా బోధిస్తాయి. సాయంసంధ్యలో కూడా ఇదే సత్యాన్ని దర్శించిన చేమకూర వేంకటకవి వివేచనం గమనింపదగింది.

*ఒకమెట్టు తరణి డిగ్గిన*
*ఒక మెట్టు శశాంకుఁడెక్కు; నుర్వీస్థలిలో*
*నొకరాజు సన్నగిల్లిన*
*నొకరాజంతంతకును మహోన్నతి గనడే.*

ఉదయాస్తమయాలను ఒకేసారి చేపే ఉజ్జ్వల సమయాలు ఉభయసంధ్యలు.

*ఏప్రిల్- మే 1977*

*జి.వి. సుబ్రహ్మణ్యం*

# నీవు - నీది

ఈ కాలంలో బ్రతుకు, యీ ప్రపంచాన్ని ప్రతిఫలించు
ఇంటికున్న కిటికీలన్నీ తెరచి అన్ని పవనాల్నీ ఆహ్వానించు
నువ్వు చెప్పే దేదైనా నీదై వుండాలి
నీ లోంచి రావాలి, చించుకొని రావాలి - తిలక్

'కవిత వున్నప్పుడే నవత రాణిస్తుందనీ, అసలు కవితలోనే నవత కూడా ఉందనీ గుర్తించిన కీ.శే. దేవరకొండ బాలగంగాధరతిలక్ నవకవితకు చూపించిన నాణెమైన బాటయిది. కవిత తన కాలంలో బ్రతకాలి అని మొదటి సూచన. సమకాలీన సమాజ చైతన్యం దానిలో ఉండాలని భావం. కవిత తెలుగులో పుట్టినా విశ్వం అందులో ప్రతిబింబించాలని మరోసూచన. విశ్వదృష్టికి విభిన్నమైనది కవితా స్వభావం కాదనీ, ప్రపంచాన్ని చూడని కవితకు ప్రతిపత్తిలేదనీ, ప్రపంచంలోని మానవాత్మ, భౌతికంగా, ఆంతరంగా స్పందించి జీవించే జీవితమే ప్రపంచమనీ తిలక్ విశ్వాసం. ఇంటి కిటికీలన్నీ తెరచి ఉంచి గాలిని నాల్గు దిక్కులనుంచీ లోనికి పిలిపించుకొనే విశాల దృక్పథం కవితకుండాలని ఆయన చేసిన మూడో సూచన. ప్రపంచ వ్యాప్తంగా సాగుతున్న ప్రక్రియా ప్రయోగ వైవిధ్యంగానీ, సిద్ధాంత సౌరభంగానీ, జీవిత వ్యథాకథాలహరికాని, ప్రగతిగానీ, ప్రస్థానంగానీ తెలుగు కవితలో వెలుగు నింపాలని ఆయన ఆకాంక్ష; చెప్పేతీరు మాత్రం దేశీయం కావాలని ఆయన కోర్కె. అనుభవం విశ్వజనీనం, అభివ్యక్తి ఆత్మీయంగా కవిత కుండాలని ఆయన అభిలాష. అది కవిహృదయం లోంచి, చించుకొని రావాలి. కవి విశ్వాత్మను తనలో నింపుకొని, అనుభూతిని వేదనగా అనుభవించి, వేదనలోనుండి వెలువడే వేదంలా కవితను వినిపించాలని తిలక్ వివేచన. అసలు కవిత కవి తనదిగా చెప్పే అనుభూతిలోని అభివ్యక్తి. అది నవతగా ఉంటుందనటంలో ఉండదెట్టి సంశయోక్తి!

కవిత బ్రతికేది సమకాలీన విశ్వజీవితంలోనైనా, కలకాలం విశ్వాత్మను నింపుకొని అమృతంలా బ్రతికేశక్తి దానికుండాలి. ఆవరణాలను ఛేదించుకొని ఎదిగే శక్తీ, అనుభూతిని నింపుకొని నిలిచే ఉక్తీ, స్వతంత్ర వ్యక్తిత్వంతో సాగే ప్రసక్తీ కవితకుంటే అది ఎన్నడైనా నవతగానే కనపడే కవిత అవుతుందని తిలక్ దృష్టి. 'నీవు' ను తెలుసుకోకపోతే నీలోంచి కవితరాదు; 'నీదాన్ని' నీవు తెలుసుకోలేక పోతే కవిత నీది కాదు; విశ్వాన్ని నీవు నీలో నింపుకోకపోతే నీవు ఏకాకివి. బ్రతుకును కోల్పోయిన భగ్నజీవివి!

*జూన్ 1977*

# సాహిత్య దర్శనం

*పొరపాటును దిద్దుకుంటున్నాను*
*సరిక్రొత్త పాఠం నేర్చుకుంటున్నాను*
*గణం కంటె గుణం ముఖ్యమని*
*రాశి కంటె రమ్యత శ్రేష్ఠమని*

పద్మశ్రీ డా॥ సి. నారాయణ రెడ్డిగారి ఆత్మసూక్తమిది. గణంలోంచి గుణంలోకి. రాశిలోంచి రమ్యతలోకి పయనించిన కవితాప్రస్థాన మిది. ప్రస్థానం ప్రవృత్తిశీలం. అన్వేషణం ప్రస్థానలక్షణం. అభ్యుదయం ప్రస్థానమార్గం. గణం బాహిరమైన నియతికి సంకేతం. పద్యం వ్రాసినా, గేయం ఆలపించినా అక్షరమాత్రాగణం ఆవరణాల స్వేచ్ఛాగతిని సీమితం చేస్తాయి. నియతిలో అందం లేదని కాదు. సృష్టికే నియతి నిత్యం. నియతిబాహిరమైతే గణం, అంతరమైతే గుణం. అనుక్షణం అంతర్ముఖమయ్యే కవి అనుభవం అభివ్యక్తిలో బహిర్ముఖం అవుతుంది. బహిరభివ్యక్తి గతి; అంతర్వ్యాప్తి అనుభూతి. అభివ్యక్తమైన కళాఖండంలో అనుభూతికి అగ్రతాంబూల మందితే గుణం భాసిస్తుంది; గతి అభివ్యక్తిని శాసిస్తే గణపాఠమౌతుంది. గణం గుఱ్ఱం, గుణం రౌతు. పగ్గం పట్టినవాడు గుణం, పగ్గానికి తలయొగ్గినవాడు గణం.

రాశి అభ్యాసానికి ఫలం; రమ్యత సౌందర్యానికి చిహ్నం. ఒకటి భౌతిక కాయం, మరొకటి భవ్య ప్రకాశం. ఒకటి ఆకృతి; మరొకటి ఆత్మ ప్రకృతి. పదార్థపరిమాణం నుండి పరమార్థశక్తిని ప్రతీయమానం చేసే ప్రజ్ఞాప్రస్థానానికి ఈ పురోగతి ప్రతీక.

రమ్యత నాదరించే కవిత అందాన్ని ఆరాధిస్తుంది; గుణాన్ని గౌరవించే కవిత చందాన్ని సాధిస్తుంది. అందచందాలు ఆకృతివనుకోవటం అజ్ఞానం. ఆత్మకిరణాలుగా దర్శించటం విజ్ఞానం. కవితాజగత్తులో ఆత్మ రసం. రసానికి ఆస్వాదనీయగుణం రమ్యత. రమ్యతకు ఆస్వాదనీయత్వాన్ని కలిగించే లక్షణం గుణం. గుణం లేని గణం కవిత కొకవ్రణం. రమ్యతలేని రాశి కవిత కొకమరణం.

మృత్యువు నుండి అమృతం వైపు పయనం సాగిస్తే మహాప్రస్థానం. గణరాశినుండి గణరమ్యతవైపు కలం సాగిస్తే కవితాప్రస్థానం! ఈ రెంటినీ ఒకేసారి దర్శిస్తే సాహిత్య దర్శనం!

---

*ఆంధ్ర సాహిత్య చరిత్రలో కవిత్రయం తరువాత కావ్యయుగకర్తగా నిలిచినవాడు శ్రీనాథుడు. వారు పురాణేతిహాసానువాదం నిర్వహింపగా ఈయన ప్రౌఢకావ్యానువాదాన్ని చేపట్టి తన ప్రత్యేకతను నిరూపించుకున్నాడు. శ్రీనాథుని కావ్యాలకున్న ప్రశస్తి ఒక యెత్తు. ఆయన కవితాశైలికున్న ప్రశస్తి మరొక యెత్తు. శబ్దార్థోభయప్రధానమైన శ్రీనాథునివైదర్భీరీతి తెలుగు భారతికొక ముగ్ధమోహన సౌందర్యాన్ని సంతరించింది. నూత్నయౌవనాన్ని ప్రసాదించింది.*

- జి.వి.యస్. (శ్రీనాథుని కవితా వైభవం)

---

*జులై 1977*

జి.వి. సుబ్రహ్మణ్యం

# కాదా?

'నీవు' ను తెలుసుకోపోతే - నీలోంచి కవిత రాదు
'నీదాన్ని' నీవు తెలుసుకోపోతే - కవిత నీది కాదు

ఆలోచనంలో నందిని అన్నమాటలు. 'పైదాన్ని తెలుసుకోవాలని ఆలోచిస్తే స్ఫురిస్తున్నాయ్ రకరకాల తాత్పర్యాలు'-అని సాహితీమిత్ర వ్యాఖ్యానం. రమణీయార్థాలను స్ఫురింపచేయటం శబ్దాల సార్థక్యానికి నిదర్శనం. రకరకాల తాత్పర్యాలను భావించటం సమర్థుడైన సహృదయుని లక్షణం. నీవు - అంటే ఆత్మ అని అదరిపడవచ్చు; పరమాత్మ అని భయపడవచ్చు - వేదాంతం, ఆత్మ జ్ఞానం తెలిస్తేనే నిజమైన కవిత్వం వస్తుందని భావించవచ్చు - ఒకవేళ అలా అనకున్నా పరమార్థాన్ని పట్టుకున్నట్లే. అంతదూరం పోవనవసరం లేదు. కవితలల్లే రచయితను తీసుకుందాం. కవిత పుట్టేది అనుభూతి నుండి -నీవు బ్రతికేది అనుభూతిలో. నీవంటే నీవుగా నిజంగా నిలిచేది అనుభూతి. అనుభూతి నుండే ఆవిర్భవిస్తుంది అసలైన కవిత. అనుభూతిని పొందే అధికారమే 'నీవు'. అనుభూతి అందరికీ కలుగుతుంది-అభివ్యక్తి కవికే చేతనౌతుంది. అనుభూతిని ఆస్వాదించేటప్పుడు కవి ద్రష్ట. అనుభూతికి ఆకృతి దిద్దేటప్పుడు స్రష్ట. సృష్టి తెలిసి చేస్తాడా? తెలియక చేస్తాడా? ఆవేశంతో చేస్తాడని సాధారణంగా అనవచ్చు. ఆ ఆవేశం ఏంటి? అనుభూతి నుండి సృష్టి కలగటానికి వాహికంగా నిలిచేశక్తి. లోకంలో చెట్టు కనపడుతుంది. పండు కనపడుతుంది; ఆ చెట్టుకూ పండుకూ ఆధారమైన మూలం కనబడదు. సృజన వ్యాపారంలో కవి తనకు తెలియకుండానే తన అనుభూతిని విమర్శించుకుంటాడు, అందులోని సారాన్ని ఆవిష్కరిస్తాడు. కవనమంటే రసాభావాల విమర్శ అని భట్టతౌతుడందుకనే అన్నాడు. తెలిసి చెప్పేవాడు కాన్షస్ ఆర్టిస్ట్. చెప్పి తెలుసుకునేవాడు అన్‌కాన్షస్ ఆర్టిస్ట్.

అనుభూతిలో కలిగేస్పందన వ్యక్తిది. స్పందన ఆ వ్యక్తి సంస్కారాన్ని బట్టి ఉంటుంది. ఆ స్పందన సంస్కారం అభివ్యక్తమైన కవితలో కనపడే వ్యక్తిత్వం. ఆ వ్యక్తిత్వాన్ని కవివ్యక్తిత్వంగా గుర్తిస్తాం. ఒక్కొక్కసారి అది అతని జాతి వ్యక్తిత్వంగా కూడా సాక్షాత్కరింపవచ్చు. ఏమైనా కవి 'నాది' అనుకొనే ప్రత్యయం కవితలో లేకపోతే కవికి వ్యక్తిత్వం లేదు. అనుకరణాన్ని, అనువాదాన్నీ ఆశ్రయించి అస్తిత్వాన్ని మరచిపోవటం వ్యక్తిత్వానికి లక్షణం కాదు. అనువాదంలో సంవాదం సాధించటం సమర్థనీయం; ఏ వాదంలోనైనా 'నీ' దన్నది నిలుపుకోవటం అభిలషణీయం! కవితలో మాత్రం ఇది కాదా?

*ఆగష్టు 1977*

# సత్యం ఒకటే

*చెప్పవలెఁ గప్పురంబులు*
*కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పై పై*
*గుప్పినక్రియ విరిపొట్లము*
*విప్పిన గతి ఘుమ్మనం గవిత్వము సభలన్*

రసికుడైన రఘునాథ రాయలు రమణీయంగా చెప్పిన కవితా నిర్వచనమిది. కర్పూర ఖండాలు కుప్పలుగా పోసినట్లు కవిత్వం చెప్పాలని మొదట చెప్పి, దానిమీద కుంకుమపూవు గుప్పిన విధంగా ఉండాలని విశేషించి చెప్పాడు రఘునాథనాయకుడు. ప్రభువు కాబట్టి సుగంధద్రవ్యాల స్వభావం బాగా తెలిసినవాడు ఆయన. కర్పూరం సువాసనకు, చల్లదనానికీ ప్రసిద్ధి, కుంకుమ వాసనకూ, రక్తిమకూ ప్రసిద్ధి. వీటిని కవిత్వానికి అన్వయిస్తే శబ్దార్థాలకు సమన్వయించాలి. రమణీయార్థ ప్రతిపాదక శబ్దం కర్పూర ఖండం లాంటిది; అర్థం సౌగంధ్యం; ఎడదకు చల్లదనాన్నిచ్చేది శబ్దం. కుంకుమ రంగరింపు అలంకారణం. కప్పురం తెల్లనైనది. అందువల్ల ప్రసాదగుణానికి ప్రాతినిధ్యం వహిస్తుంది; కుంకుమ ఓజో మాధుర్యాల సమావేశానికి చిహ్నం. రమణీయమైన అర్థం ధ్వన్యాత్మకంగా ఉండాలని చెప్పటానికే 'విరిపొట్లము విప్పినగతి' ఉండాలని పేర్కొన్నాడు రఘునాథరాయలు. పొట్లం విప్పితే ఘుమ్మని వచ్చే సౌగంధ్యం వ్యంగ్యం. పూలపొట్లాన్ని కవి సంస్కారమని కూడా చెప్పవచ్చు; సద్యఃస్ఫూర్తిని కలిగించే గూఢం కాని భావమని కూడా చెప్పవచ్చు; ఉపమానంలో కూడా ఊహించిన కొద్దీ వ్యంగ్యం స్ఫురించటం విశేషం. అంతా వ్యంగ్యానికి వదిలితే చదువరులకు స్పష్టమైన తెలివిడి కలుగుతుందో లేదో అని ఆయనే వాచ్యం చేశాడు లక్షణాన్ని!

*'చెవులకుఁజవులై చల్లఁగఁ*
*గవులకుఁదవులై సమస్త కావ్యకళా బం*
*ధువులై రససింధువులై*
*యవురా! యనఁగవిత లవని దనరఁగవలదా?'*

మొదట శ్రవణానందం కలిగించటం, ఆ పైన హృదయతర్పణం చేయటం కళావిలాసాన్ని ప్రదర్శించటం రసానుభూతిని అందించటం కవితా ధర్మాలు! సూక్తులు వేరు కావచ్చు కాని సత్యం ఒకటే!

*సెప్టెంబర్ 1977*

# నవోదయలహరి

ప్రతి ఉదయం వెనుక ఒక చీకటి రాత్రి ఉంది. ఆ రాత్రిలో 'తమసోమా జ్యోతిర్గమయ' అన్న ఆర్తి ఉంది. చీకటిని చీల్చుకొని వెలుగు ఉదయించే తరుణం జగత్తుకు సుప్రభాతం. ప్రతిరోజూ ఉదయంతో క్రొత్త చరిత్ర ప్రారంభిస్తుంది. ప్రతినిత్యం జగత్తు క్రొత్తదనాన్ని అనుభవిస్తోంది.

సాహిత్యం సజీవ తరంగిణి లాంటిది. అదీ కాల ప్రవాహం లాగా అనంతంగా ముందుకు సాగిపోతుంటుంది. చీకటిపడినా, ప్రొద్దుపొడిచినా ప్రవాహం మాత్రం ఆగదు. అయితే ఆ నది కటిక చీకట్లో రేఖా మాత్రంగా స్ఫురింపవచ్చు; వెన్నెల రాత్రుళ్ళలో కళామయంగా కదలాడవచ్చు; సూర్యరశ్మిలో ఉజ్జ్వలంగా ప్రకాశించవచ్చు. ఆకృతి ఒకటే అయినా అవస్థల్లో భేదం కనపడవచ్చు; ఒక చీకటి రాత్రిని దాటి ఒక ఉషస్సు దర్శించిన ప్రవాహ ప్రగతిని 'నవోదయ' మంటాం. అది అంతటితో ఆగకుండా అనంతంగా పొందే అభ్యుదయ పరంపరకు ప్రతీకగా 'నవోదయలహరి'ని సంభావిస్తాం!

రాయప్రోలు కవిత ఒక క్రొత్తయుగానికి ఉషస్సు. నవ్యకవితామాకందశాఖపై నిలిచి అమలిన శృంగార తత్వాన్నీ, పూర్వాంధ్ర ప్రాభవగీతాన్నీ 'ఆంధ్రావళి మోదముంబొరయ' నాలపించిన పుంస్కోకిల రాయప్రోలు! ప్రణయానికీ ప్రణవానికీ మధ్యనున్న ప్రవృత్తిని జీర్ణించుకొని బహిరంతర్మధురంగా భావనం చేసి, జీవితయాత్రకే ప్రణయవ్యాఖ్యానంగా కవితా ప్రస్థానాన్ని సాగించిన కవితామూర్తి నాయని సుబ్బారావు. ముగ్ధమైన జానపద ప్రణయానికి, ప్రౌఢమైన భావనాన్ని జోడించి మనోజ్ఞగేయలహరిని పొంగించిన రసమూర్తి నండూరి సుబ్బారావు - అభ్యుదయ కవితకు శ్రీశ్రీ ఆకృతినిస్తే ఆరుద్ర ఆటలు నేర్పాడు. ఆధునిక క్రీడలాడిన ఆంధ్రభారతి ముద్దు బిడ్డ ఆరుద్ర. వచన కవితకు ఉద్యమ స్ఫూర్తిని కల్పించి, జనవాక్యంగా కవిత నిండాలని కృషి చేసి, పంటలు కూడా కళ్లారా చూస్తున్న వచనకవితా పితామహుడు కుందుర్తి ఆంజనేయులు. ప్రయోగానికి ప్రతిభతో ప్రాణం పోసి, గేయానికి కావ్యగౌరవాన్ని కల్పించి, వచనానికి వైఖరీ వాల్లభ్యాన్ని సంతరించి, పట్టిందల్లా బంగారం చేయగలిగిన ప్రజ్ఞామూర్తి డా॥ సి. నారాయణరెడ్డి.

ఆధునికాంధ్ర సాహిత్యలహరికి రాయప్రోలు ఒక నవోదయం; నాయని ఒక శుభోదయం; నండూరి ఒక రాగోదయం; ఆరుద్ర ఒక అరుణోదయం; కుందుర్తి ఒక తరుణోదయం; నారాయణరెడ్డి ఒక నవ్యోదయం. ఇన్ని ఉదయాలను దర్శిస్తూ సాగివస్తున్న నవ్యసాహిత్య ప్రస్థానంపై సహృదయసమీక్ష 'నవోదయలహరి' - ఉపన్యాస మంజరి.

*అక్టోబర్ 1977*

# మూడు ముళ్లు

'యెనక జన్మములోన యెవరమో' నంటి
సిగ్గొచ్చి నవ్వింది సిలక - నా యెంకి.
'ముందు మనకే జన్మముందోలె' యంటి.
తెల్లతెలబోయింది పిల్ల - నా యెంకి,
'యెన్నాళ్లొ మనకోలె యీసుకము' లంటి
కంటనీరెట్టింది జంట-నాయెంకి.

మూడు జన్మలకథ మూడు చరణాల్లో ముడివేశారు నండూరి సుబ్బారావుగారు. యెంకీ నాయుడు బావల ప్రణయం నవ్య సాహిత్యంలో ఒక నవ వసంతోదయం. అమాయక జానపద హృదయాల వెనుక ఆదర్శప్రణయం అద్వైత ప్రేమగా రాణించింది. వారిరువురి ప్రతి మాటలో గుండె నిండుగా స్పందించింది. భావన పరిమళంగా వ్యాపించింది. యెంకి పాటలు వంకలేని వలపుబాటకు సంకేతాలు!

పై పాటలో నాయుడు మాటాడి మెప్పిస్తాడు. యెంకిపిల్ల హావభావాలతో అలరింపజేస్తుంది. బావ వెనుక జన్మపు ఊసెత్తినప్పుడు చిలకలాగా మాటలు నేర్చి కూడా యెంకి సిగ్గుతో తలవంచుకొని మొగ్గనవ్వు నవ్వి ఊరుకుంది. అర్థం! పాఠకుని ఊహావిహంగం ఎంత ఎత్తుకు ఎగిరితే అంతదాకా దాని అంచు పెంచుకొని ఉంటుంది. ఈ జన్మలో భార్యాభర్తలు పూర్వజన్మలో కూడా అదే అయి ఉండాలన్నది వ్యంగ్యంగా స్ఫురించే విశేషార్థం. ముందు జన్మప్రసక్తి వచ్చినప్పుడు యెంకి తెల్లతెలపోవటం ఆమె అమాయకత్వానికి చిహ్నం! అందుకే ఆమెను 'పిల్ల' అంటారు నండూరి. అమరులైన వాళ్ళకు పునర్జన్మ యేంటి? అని మనమూ తెల్లబోతాము. 'ఈ సుఖం కలకాలం నిలిచేనా?' అని బావ అనుమానిస్తే కంట తడి పెట్టింది యెంకి. ఆ జంట క్రౌంచమిథునం లాంటిది. దేనికి ముప్పువచ్చినా కరుణ రసం కట్టలు తెంచుకొంటుంది. కష్టంలో కూడా కన్నీళ్లతో కలిసి నడిచే ప్రణయమూర్తి యెంకి. విధి కూడా తీయలేని జంట యెంకీ నాయుడు బావలు!

మూడు చరణాలలో తత్త్వజ్ఞానాన్నీ, భారతీయ ప్రణయ సంస్కారాన్ని, ఆలుమగల ఆర్ద్రభావాలనీ అందంగా చిత్రించారు నండూరి. అలతి అలతి మాటల్లో అనంతమైన భావం చెప్పారు. పై చరణాలలో యెంకీనాయుడు బావలకే కాదు. స్నిగ్ధ ప్రణయానికీ, ముగ్ధ అభినయానికీ, భావ మాధుర్యానికీ నండూరివారు మూడు ముళ్ళువేశారు. ఈ పాటల్లో జీవం భావం; శక్తి ఉక్తి; శ్రుతి గీతి!

*నవంబర్ 1977*

# తల్లిదండ్రులు

గతం చూసి గర్వించడం మంచిదే కాని,
ప్రస్తుతం పఠించటం మరీ మంచిది;
గతం విస్మరించడం తప్పే- కాని,
పట్టుకు వేలాడ్డం మరీ తప్పు

వచన కవితాపితామహుడు కుందుర్తి వచనమిది. పురావైభవస్మరణ వర్తమాన సమస్యలపట్ల విస్మృతిని కలిగింపరాదనీ, గతాన్ని పూర్తిగా విస్మరించటం తప్పేనని, అయితే అదే తప్ప మరింకొకటి లేదనీ, ఉండబోదనీ, భావించటం తగదనీ కుందుర్తి ప్రబోధం. ఇది ఎంతైనా సత్యం. గతం తెచ్చిన గర్వం కంటె వర్తమానం తెచ్చే ఘనతమీద దృష్టిలేకపోతే మనిషి కార్యశీలికాలేడు. ప్రగతి పథంలో పయనించలేడు. చరిత్రను సృష్టించే సమరం సమకాలంలో ఉండాలి. ఉజ్జ్వల భవిష్యత్తును దర్శించే ఉత్తేజం ఉండాలి.

కుందుర్తి దృక్పథంలో 'పాతకాలం పద్యమైతే, వర్తమానం వచన గేయం.' కాలంతో పాటు కవితను పఠించాలంటే వర్తమానంతోపాటు వచన గేయాన్ని పఠించమని వారి ఆదేశం.

'నేటి కాలపు కవిత్వం మరీ చెప్పినమాట వినదు
నియమాలు లేమి రామికి సాకు!
ఛందస్సు పెద్దలకు మూఢ విశ్వాసాలు లేవనను
అది పామరులతో షరీకు.'

చెప్పినమాటను వినని, నియమాలూ లేని, సామాన్యున్ని బాధలగాథల్ని సమీక్షించి సమకాలీన కవితను పఠించడానికి సహృదయత్వం ఉండాలి. నియమాలు పాటించటం చేతకాక వచన కవితలల్లేవాళ్లు లేకపోలేదు; పామరులతో షరీకైనట్టు ప్రకటితం చేసుకోవటానికి పద్యాలను తిట్టేవారు లేకపోలేదు. అయినా, ఆ బలహీనతలు ప్రయోగ దక్షులకు పట్టేవి కావు. 'ఇది నా కవిత్వం గీత, వినేవాడు నరుడు - చదువూ సంధ్యలు రాని రోడ్డుమీద పామరుడు; లేమితల్లి ఒడిలో నిరంతర గాఢనిద్రాపరుడు' అన్నారు కుందుర్తి. నిద్రాపరుణ్ణి లేపాలన్నా ఏమీ రానివాడికి అర్థమయ్యేట్లు చెప్పాలన్నా, నరునికి గీత వినిపించాలన్నా ప్రవక్త వైతాళికుడు కావాలి, కళాస్రష్ట కావాలి, తాత్త్వికుడు కావాలి. ఈ మూడు గుణాలు కుందుర్తికి ఉన్నాయి. ఆయన వచన కవితలో విరాణ్మూర్తిని ప్రకటిస్తాడు. శబ్దాడంబరాన్ని సగంచేసి, అర్థగౌరవాన్ని మరోసగం చేసి అర్ధనారీశ్వరుడిగా తన కవితా రూపాన్ని తీర్చిదిద్దుకున్నాడు.

శబ్దాన్ని వక్రోక్తిగా మలచటం, అర్థంలో ఒక పరమార్థాన్ని ధ్వనించటం కుందుర్తి కవితాగుణం. దానికి తల్లి సౌందర్యం, తండ్రి ప్రయోజనం! ఆయన వాక్కుకే కాదు అసలు (వచన) కవితకే ఆ రెండూ తల్లిదండ్రులు.

*డిసెంబర్ 1977*

# విటత్వమా? వీరత్వమా?

From time to time, every hundred years or so, it is desirable that some Critic shall appear to review the past of our literature and set the poets and the poems in a new order

అని టి.ఎస్. ఇలియట్ అన్నాడు. ఇది నిజం. ప్రతిశతాబ్దంలోనూ గతాన్ని సమీక్షించి వర్తమానాన్ని వివేచించి, సాహిత్య భవిష్యత్తుకొక ఉజ్జ్వల దర్శనాన్నిచ్చే మహా విమర్శకుడావిర్భవించాలి. అతని వ్యవసాయం నవ్యఫలసాయానికి నాంది నాలపించాలి. తెలుగువారికీమాట ఎంత అనుభవసత్యమో అంత ఆదర్శంగా భాసిస్తుందనటంలో ఆశ్చర్యం లేదు. దానికి కారణం - మనకు కావ్య ప్రయోగాలమీద ఉన్న మోజు సాహిత్య విమర్శమీద లేదు; క్రొత్తను అరువు తెచ్చుకోవటంలో ఉన్న శ్రద్ధ భవిష్యత్తుకు తగిన పునాదులు వేసుకోవటంలో లేదు; ప్రయోగాన్ని ప్రచారం చేసుకోవటంలో ఉన్న నిష్ఠ ప్రయోగమూలమైన భవిష్యద్దర్శనాన్ని సాధించటంలో లేదు. అందువల్ల తెలుగులో అన్ని యుగాలలోనూ కవిత్వం వెంట విమర్శ అనుసరించటమే గమనిస్తాం కాని, విమర్శ సాహిత్యానికి మార్గం చూపిన జాడలను చూడలేము. ఆంధ్రసాహిత్య విమర్శ సృజనాత్మకతను సాధించలేకపోవడానికి ఈ బలహీనత బలంగా మన సాహిత్య క్షేత్రంలో పాతుకొని పోవటమే కారణం.

ఈనాడు ప్రాచీన సాహిత్యం, ఆధునిక సాహిత్యం అని కావ్యజగత్తును వివేచించి విమర్శిస్తున్నట్లుగానే ప్రాచీన విమర్శ, ఆధునిక విమర్శ అనే విభాగాన్ని విశేషంగా మన్నించకపోయినా, అటువంటిది ఉండాలన్న ఉబలాటం, ఉన్నదన్న ఊహ చాలామంది ఆధునికుల్లో కనపడుతోంది. కాని, స్పష్టమైన తెలివిడి లోపించింది. ప్రాచీన కావ్యాలనుగాని, ఆధునిక యుగంలోని సంప్రదాయ సాహితినిగాని ప్రాచీన ప్రమాణాలతో పరిశీలిస్తే ప్రాచీన విమర్శ అవుతుందనీ, ఆధునిక కావ్యప్రయోగాలను ఆధునిక దృక్పథంతో సమీక్షిస్తే ఆధునిక విమర్శ అవుతుందనీ సాహితీ లోకంలో సర్వసాధారణంగా నేడు భావింపబడుతున్నది. అసలు తెలుగులో సాహిత్య విమర్శయే ఆధునికం కాబట్టి ఎటువంటి విమర్శ అయినా ఆధునిక ప్రక్రియగానే పరిగణింప బడాలని కొందరూ, సంప్రదాయభిన్నమైన మార్గమే ఆధునికమని మరికొందరూ వివేచించటం కూడా ప్రచారంలో ఉంది. ఈ వాదాల వెనుక ఉన్న నిజమైన పరిస్థితి ఏమిటంటే - విమర్శ ప్రమాణాన్ని మాత్రమే ఆశ్రయించి బ్రతికేదికాదని దానికీ కవితకులాగానే ఒక ప్రయోజనముందనీ సాహితీలోకం సమగ్రంగా గుర్తించటంలేదు. దానివల్ల తెలుగులో సాహిత్య విమర్శ పరమార్థం లేని పరిశ్రమకు తరతరాలుగా అలవాటుపడింది. ఈమాట వినటానికి విడ్డూరంగా ఉన్నా నిష్ఠురమైన నిజం. అయితే, ఇక్కడ - విమర్శ సాధించే ప్రయోజనమేమిటన్న ప్రశ్న ఉదయించవచ్చు. విమర్శ అనుశాసనాన్నిగాని, అనుశీలనాన్నిగాని చేస్తుంది. అది దాని స్వభావంగాని ప్రయోజనం కాదు. ఈ విమర్శ స్వభావం వల్ల సాహిత్యాస్వాదనశక్తి సమాజానికి కలుగుతుంది. ఇది ప్రయోజనమే. కాని, అదే దాని లక్ష్యం కాదు. దాని గమ్యం సాహితీజగత్తులో నూత్న సృజన వ్యాపార చైతన్యాన్ని కలిగించే ఒక అభినవ దర్శనాన్ని లోకానికి అందించటం. ఆస్వాదశక్తి భిత్తిక, దర్శనం రేఖాచిత్రం. కావ్యంవంటి సాహితీ ప్రక్రియలు ఆ రేఖా చిత్రాలకు వర్ణ సంయోజనం చేసి రూపవైభవాన్నీ, వైవిధ్యాన్నీ సంతరిస్తాయి. అభినవ దర్శనాన్ని సమాజానికివ్వడమే సాహిత్య విమర్శకు పరమ ప్రయోజనం! దాన్నే విమర్శకున్న సృజనాత్మకతాగుణంగా విజ్ఞులు వివేచిస్తారు. విమర్శకుడు పరిశీలకుడుగా, పరిశోధకుడుగా

మాత్రమేకాక పరమార్థ దర్శకుడుగా, అభ్యుదయ ప్రవక్తగా ఎదిగినప్పుడు మాత్రమే అతని విమర్శ సృజనాత్మక విమర్శగా సార్థకమౌతుంది. ప్రయోజనానికి ప్రమాణం ఎప్పుడూ సాపేక్షమేకాని నియతం కాదు. అట్లని ప్రయోజనం ప్రమాణదూరం కాదు. ప్రయోజనం వెంట పరుగెత్తేదే నిజమైన ప్రమాణం! స్వతంత్రంగా పురోగమించే విమర్శకు ఈ లక్షణం అభ్యుదయ చిహ్నం!

నేటి తెలుగు సాహిత్య విమర్శను ఈ దృష్టితో పరిశీలిస్తే ఎక్కడ నిలుస్తుంది? నేటి సాహిత్య విమర్శ ప్రధానంగా సమన్వయాన్ని సాధించడానికి యత్నించే సమీక్షగా సాగుతోంది. ఈ సమన్వయం సాధారణంగా ప్రయోగ ప్రమాణాలకూ, ప్రయోగ ప్రయోజనాలకూ మధ్య సాధింపబడుతున్నది. తెలుగులో వెలసిన ఒక ప్రయోగాన్ని విలువ కట్టటానికీ, దాని స్వభావాలను నిగ్గుతేల్చటానికీ శాశ్వత ప్రమాణాలను గానీ, సాపేక్ష ప్రమాణాలనుగానీ ప్రాతిపదికలుగా తీసికొని పరిశీలించే పద్ధతి మొదటి రకం సమన్వయానికి వర్తిస్తుంది; సాహిత్యం సాంఘికంగా, సాహిత్య పరంగా సాధింపదలచుకొన్న ప్రయోజనాన్ని ఎలా సాధిస్తున్నదని, మార్క్సిస్టు దృక్పథంతోనూ, మానవతా వాద హేతువాద దృక్పథాలతోనూ సమీక్షించే పద్ధతి రెండోరకం సమన్వయానికి వర్తిస్తుంది. ఈ రెండూ విమర్శ చేసే అనుశీలనకు ఉపలక్షకాలే. వీటి ప్రచారం వల్ల ప్రచురిత ప్రయోగాల స్వరూప స్వభావ ప్రయోజనాలను వివేచించి లోకానికి తెలియ చెప్పటమే విమర్శగా నేడు సంభావింపబడుతున్నది. దీన్ని ఉత్తమ సాహిత్య విమర్శగా ఉల్లేఖించటం ఉచితం కాదు. తెలుగులో నాటికీ నేటికీ కవి దార్శనికుడై మార్గం చూపిస్తున్నాడు; విమర్శకుడామార్గంలో ఓపినంత స్నేహం నింపి దివ్వెలు వెలిగిస్తున్నాడు!

ఇలా కావటానికి చారిత్రకంగా కొన్ని కారణాలు లేకపోలేదు. నన్నయకు ముందు ప్రమాణాలున్నాయి కాని ప్రయోగాలు లేవు. ఆ తరువాత ఎందరో మహానుభావులు ఎన్నో ప్రయోగాలు చేశారు. వారందరూ ప్రయోగాలనూ, ప్రక్రియలనూ పెంచుకొంటూ పోయారే కాని వాటికి తగిన ప్రమాణాలను పేర్కొంటూ రాలేదు. అందులోనూ దేశీ పద్ధతుల్లో సాగిన ప్రయోగాల ప్రమాణాలు విమర్శక్షేత్రంలో వెలుగులోకి రాలేదు. ఆంధ్ర లక్షణ గ్రంథాల్లో సంస్కృత లక్షణానుకరణం మితిమీరి పోవటంవల్ల అనువర్తిత విమర్శ ప్రమాణాలు విమర్శక్షేత్రంలో వెలుగులోకి రాలేదు. ఆంధ్ర లక్షణ గ్రంథాల్లో సంస్కృత లక్షణానుకరణం మితిమీరి పోవటం వల్ల అనువర్తిత విమర్శ ప్రమాణాలుగాని, విధానాలుగాని ప్రక్రియాపరమైన ప్రమాణ వివేచనంగాని తెలుగులో రూపొందలేదు. వీరేశలింగం పంతులుగారి కాలానికి తెలుగులో ప్రక్రియలూ, ప్రమాణాలూ సృజనాత్మకతను కోల్పోయి జడత్వాన్ని భజించి స్తంభించి పోయాయి. ఈనాటికీ, ఆనాటి కావ్యాలను అన్వయించాలంటే సంస్కృత లక్షణగ్రంథాలే శరణ్యా మౌతున్నాయి.

నవ్య సాహిత్య యుగోదయం నుంచీ తెలుగువారికి పాశ్చాత్య ప్రక్రియలూ, ప్రమాణాల్లో క్రొత్తగా లభించాయి. మరో ప్రపంచం వెలుగు వారికి కనపడింది. పశ్చిమాన్నుంచి వినూత్న ప్రయోగాలను తెలుగులోకి దిగుమతి చేసుకొన్నారు. సృజనాత్మక రంగంలో ప్రపంచంలోని ఆయా దేశాల్లో కళాసాహిత్య రంగాల్లో వెలసిన ప్రయోగాలకు మూలమైన సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక ఉద్యమాలూ, వాటి సిద్ధాంతకర్తలు ప్రపంచించిన ప్రమాణాలూ తెలుగునాట వెలసిన నవ్య, అభ్యుదయ, ఆధునిక సాహిత్య ప్రయోగాలు ప్రచండ వేగంతో పరువులు తీశాయి కాని ప్రయోగ విజ్ఞానం తెలుగులో మందగమనంతో సాగింది. ఆధునిక యుగంలో సాహిత్య విమర్శకుడు ప్రాచీన ప్రయోగాల కొకవైపూ, నవ్య ప్రయోగాలకు మరొకవైపూ సమన్వయ పరిజ్ఞానాన్ని సమాజానికి అందింపవలసి

వచ్చింది. అనువర్తిత విమర్శ తెలుగులో ఆదినుంచీ ప్రచురంగా లేకపోవటం చేత విమర్శకుడు పది శతాబ్దాల సాహిత్యంలో పరిశీలించి, విశ్లేషించి, వివేచించి, సమన్వయించి సాధింప వలసిన అంశాలు ఎన్నో మిగిలిపోయాయి. కొన్నాళ్లు ప్రాచీన గ్రంథాలకు ప్రామాణిక ప్రతులను సిద్ధం చేసి, వ్యాఖ్యలు వ్రాసి ప్రచురించటానికీ, కవుల చరిత్రలనూ, సాహిత్య చరిత్రలనూ, భాషా చరిత్రలనూ నిర్మించటానికీ, తదనుబంధంగా ఏర్పడిన వివాదాలలో సత్యాన్వేషణ చేయటానికీ, శాస్త్రీయ ప్రమాణాలతో కావ్య ప్రవృత్తులను పరిచయం చేయటానికీ విమర్శకలోకం అంకితమైపోయింది.

ఆ పైన కట్టమంచి వారు ప్రాచీనకావ్యాలపై నవ్యాలోకం ప్రసరించేపద్ధతిని తెలుగులో ప్రవేశపెట్టారు. వారి పాశ్చాత్య దృక్పథబలంతో ప్రాచ్యదృక్పథాలకు పట్టు తప్పింది. అయినా, ప్రమాణ విచారణంలో వాదోపవాదాలు రేగి సుడులు తిరిగాయి. ఆధునికమైన మిశ్రమార్గం, క్రొత్తపాతల మేలుకలయికగా క్రమంగా తలయెత్తి తిరుగసాగింది. ప్రాచ్య పాశ్చాత్య లక్షణ సంస్కారంతో సంప్రదాయ పద్ధతికంటే విలక్షణంగా విమర్శ చేసే పద్ధతిని విశ్వనాథ వారు చూపించారు. విశ్వవిద్యాలయాలు పరిశోధనను విమర్శ మార్గంలో సంగమింపజేశాయి. విమర్శ గతాన్నీ, వర్తమానాన్నీ సమన్వయించుకోవడానికి సాముగరిడీలు సాగిస్తున్నది. ఆధునికుల్లో కొందరు కవులే తమ ప్రయోగాలకు వ్యాఖ్యానం చెప్పారు. విమర్శకుడు కవి దగ్గరికి చేరేసరికి ఒక్కొక్కసారి ఇద్దరూ చరిత్రలో వెనుకబడిపోతున్నారు. ఇది విమర్శకు సంధియుగంలా కనపడుతోంది. విమర్శ తన శక్తినంతా సాహిత్య ప్రక్రియావగాహన కనువైన సమన్వయానికే నేడు వెచ్చిస్తోంది. దీనికితోడు దేశంలో నేడు ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య లక్షణ పరిజ్ఞానాన్ని తులనాత్మకంగా సంవదింప గలిగిన సాహిత్య విమర్శకులు తక్కువై పోవటంచేత గ్రుడ్డివారు తాము తడివిన భాగమే ఏనుగని నిర్ణయించే స్థితి యేర్పడుతోంది. సమన్వయాల్లో వినూత్నాంశాలెన్నో బయటపడుతున్నా సమగ్రతతో కూడిన సాధన ఇంకా సాహిత్య విమర్శలో అవసరమని తోస్తున్నది.

ఒక ప్రయోగంలోని అంశాలను విశ్లేషించటానికి వివిధ శాస్త్రమర్యాదలను సేకరించి సమన్వయించే యత్నం పరిశోధన రంగంలో సాగుతున్నది. ఇది విమర్శప్రక్రియలను ఆధునికీకరించటానికి తోడ్పడుతున్నది. ఆధునిక విమర్శకు పరిశోధన పూర్వరంగంగా నిలిచింది. విశ్లేషణ ప్రధానంగా సాహిత్యాన్ని సమీక్షించే వివిధ దృక్పథాలనూ, మార్గాంతరాలనూ నేడు విమర్శ అన్వేషిస్తున్నది. విశ్లేషణ పెరిగిన కొద్దీ విషయ పరిజ్ఞానం పెరుగుతున్నదే కాని, తత్త్వ జ్ఞానం ప్రసన్నం కావటం లేదు. కంటి వైద్యులు కాలికి పనికి రానట్లు, సాహిత్యంలో స్పెషలైజేషను ఎక్కువై పండితుల్లో సాహిత్య సర్వాంగ పరిజ్ఞానం కుంటుపడుతున్నది. ప్రతి డాక్టరూ ఆయా అంగాలను ఆపరేషను చేసి రోగికి ఆయా జాడ్యాలను తొలగిస్తున్నట్లుగానే విమర్శకులు తమ తమ ప్రత్యేక శాఖల్లో విశ్లేషణాత్మక విమర్శలు వెలయించి ఆయా ప్రక్రియల పరిజ్ఞానాన్ని లోకానికి అందిస్తున్నారు. ఎన్ని ఆపరేషన్లు చేసినా ఆత్మను అవలోకించలేని వైద్య శాస్త్రవేత్తలాగా విమర్శకుడు సాహిత్యాత్మ దర్శనం ఈనాడు చేయలేకపోతున్నాడు. భౌతికంగా బ్రతకటం ఆధునికయుగ లక్షణం. బ్రతకటానికి బాటలు వెతకటమే నేటి సమాజ చైతన్యం, బ్రతకటానికి కూడా విలువలున్నాయని గుర్తించటం మానవతా లక్షణం. ఆ విలువలనూ, ఆ విలువలకు విలువనిచ్చే చైతన్యాన్నీ గుర్తించినప్పుడే సాహిత్యానికి సార్థక్యం; సాహిత్య విమర్శకు ప్రామాణ్యం!

దాదాపు నాలుగు దశాబ్దాలనుంచి ఆధునికాంధ్ర కవిత్వాన్ని మార్క్సిస్టు దృక్పథం నడిపిస్తున్నది. వివిధ ప్రయోగాలు అందులో వెలువడినాయి. అయినా, తెలుగులో ఈ దృక్పథంతో కవిత

ఎంతముందుకు సాగుతుందో విమర్శ అంత వెనుకబడిపోయింది. మహాప్రస్థానాన్ని గురించి మహా విమర్శ రాయవలసిన రోజుల్లో కూడా మహాభారత చర్చయే సాగుతున్నది. విప్లవ కవిత్వస్ఫూర్తిని వివేచింపవలసిన నేటి విమర్శ ఇంకా వీరశైవకవుల దేశికవితల్లోని జానపద బాణీలకు దరువువేస్తోంది. ఇది తెలుగు సాహిత్య విమర్శ వెనకబడిన తనమని అభ్యుదయవాదులంటారు. అయితే మరోవైపు - అభ్యుదయవాదులు కవిత్వం పేరిట సాంఘిక విమర్శ వ్రాస్తున్నారు. ఆ విమర్శకు రాజకీయ పార్టీ మానిఫెస్టో ప్రమాణ గ్రంథం; ఆ రెండు కలిపి చదువుకుంటే ప్రమాణ ప్రయోగ విచారమౌతుంది. ఇంక వేరే విమర్శ విప్లవకవిత కెందుకని కొందరు తిరిగి ప్రశ్నిస్తారు. ఈమధ్య కవిసేన నేటి కవిత్వానికి కావలసింది సాహిత్య స్పృహగాని సాంఘిక స్పృహకాదని నినాదం లేవదీసింది. అకవిత్వయుగంలో నుంచి కవిత్వ యుగంలోనికి అడుగుపెట్టండని యువతరాన్ని హెచ్చరిస్తోంది. విశ్వజనీనమైన సాహితీ ప్రమాణంలో కవిత్వాన్ని కొలవాలని పిలుపునిస్తోంది. కవిసేన మేనిఫెస్టోను ఆధునిక కావ్య శాస్త్రంగా ప్రచురించింది. కొత్తరకం కవిత్వోద్యమానికి విమర్శను సృజనాత్మకంగా వాడుకొనేయత్నం కవిసేన చేస్తోంది. కవిత్వం ఏమిచెపుతుందో చూడమంటారు విప్లవవాదులు. అది ఎలా చెపుతుందో అనికూడా ముఖ్యంగా గమనించండంటారు కవిసేన వారు. సాహిత్య విమర్శ ఈ రెండింటిని చూస్తుంది. అంతే కాదు ఈ రెండు చూపులకంటే ఉన్నతమైన జీవితపరమార్థాన్ని దర్శించి దాన్ని సాహిత్యానికి భవిష్యద్దర్శనంగా సమర్పిస్తుంది.

సాహిత్యం సమగ్ర మానవజీవిత దర్శనం. భౌతికమూ, మానసికమూ ఆధ్యాత్మికమూ అయిన జీవితం సమగ్రం. సమాజ చైతన్యం ఏయుగంలోనైనా ఈ మూడు మెట్లనిచ్చెన ఎక్కుతూనే ఉంటుంది. సాహిత్యం కూడా ఆయాయుగాల్లో సమాజం ఆ మూడు మెట్లను ఎలా ఎక్కుతుందో చిత్రిస్తూనే ఎలా ఎక్కాలో ప్రబోధిస్తూ వుంటుంది. విమర్శకుడు ముందుచూపు సారించి నడకసాగిస్తే రచయిత అతణ్ణి రమణీయంగా అనుకరిస్తాడు. ఈ భావాన్నే Saint Bueve ఇలా చమత్కరించి చెప్పాడు - A Critic is one whose watch is set five minutes in advance of others. తరం కంటె తలయెత్తి ముందుతరాన్ని చూచేవాడు విమర్శకుడు. అతని దర్శనం అక్షర సంహితగా మారితే విమర్శ. సాహిత్య విమర్శకు భౌతిక దర్శనం ప్రాతిపదిక; మానసిక దర్శనం హృదయదీపిక; తాత్విక దర్శనం ప్రగతి ప్రకాశిక. నేటి విమర్శకు ఈ మెట్లలో రెండు మెట్లెక్కే నేర్పుమాత్రమే ఉన్నది. మూడో మెట్టు ఎక్కగలిగితే భవిష్యద్దర్శనం ఏర్పడుతుంది. విమర్శయుగ చైతన్య ప్రేరకమైన సృజనాత్మక శక్తిని సంతరించుకుంటుంది. ఆధ్యాత్మిక తత్త్వ దృష్టితో విశ్వమానవ శ్రేయాన్ని దర్శించి, సాహిత్య ప్రక్రియా జగత్తుకు పరిణామతత్త్వంతో పాటు పరమార్థాన్ని బోధించి పురోగతిని చూపించే మహా విమర్శకుని కోసం నేటి సాహిత్య విమర్శ ఎదురుచూస్తోంది!

సాహిత్య జగత్తులో విమర్శ పురుషప్రవృత్తి కలిగింది; తదితర కావ్యప్రక్రియలు స్త్రైణమైన ప్రవృత్తి కలిగినవి. స్త్రీ పురుషుని చూచి ప్రేమించటం వీర సంప్రదాయం; పురుషుడు స్త్రీ వలన కలిగిన తన సంతానంలో తన ప్రతిబింబాన్ని చూచుకొన్నట్లు విమర్శ చైతన్యం సాహిత్య ప్రక్రియల్లో ప్రతిబింబించి నూత్న సృష్టికి శ్రీకారం చుట్టి తన అస్తిత్వాన్ని నిలుపుకొంటుంది. కాబట్టి నేటి సాహిత్య విమర్శ విట సంప్రదాయం నుండి వీర సంప్రదాయంలోనికి అడుగుపెట్టి పురోగమించాలని ఆశిద్దాం.

*అక్టోబర్ 80*

# పాలు- పెరుగు - వెన్న

విమర్శకుడు గాని పరిశోధకుడు గాని ఒక కావ్యాన్ని చదివినప్పుడు సహృదయుడుగా కావ్యానందాన్ని అనుభవించినా దాని సారూపమైన సాహిత్య దర్శనాన్ని అనుశీలించడానికి పూనుకుంటాడు. ఇంగ్లీషులో Theory of Literature అనే అంశాన్ని తెలుగులో సాహిత్య సిద్ధాంతమని గానీ, సాహిత్య దర్శనమని గానీ పిలవవచ్చు. కావ్యంతో అనుభవించదగింది రసం; ఆలోచింప దగింది తత్త్వం. ఆతత్త్వం సాహిత్య దర్శనమని పరమార్థం.

లోకంలో సామాన్యంగా అయిదు రకాల కావ్యాలు ఉంటాయి. అవి 1.కవితాస్పర్శ లేనివి, 2. చమత్కారాన్ని కలిగించేవి, 3. మధురంగా రుచించేవి, 4. సామాజిక స్పృహ కలిగినవి, 5. సాహిత్య దర్శనాన్ని అందించేవి. ఈ అయిదు రకాల కావ్యాలను చదివేటప్పుడు సహృదయుడు పొందే అనుభవంలో తప్పకుండా తేడా కనిపిస్తుంది. కవితాస్పర్శ లేని కావ్యాలను చదువుతుంటే పఠితకు ఆసక్తి కలుగకపోగా అసహ్యం కూడా వేస్తుంది. కవి కవితలో సౌందర్య సృష్టి చేయాలి. ఆ సౌందర్యమే ఆసక్తినీ, ఆస్వాదననూ కలిగించే శక్తి. ఆ శక్తిలేని కవిత పఠితల ఆదర పాత్రం కాజాలదు. అందువల్ల అది అకవిత అనిపించుకొంటుంది. ఇక రెండవ రకం కవిత దీనికంటె కొంత మేలు. మాటల గారడీవల్ల గాని, ఉక్తివక్రత వల్లగాని, శబ్దాలంకారాల వల్లగాని, శాస్త్రచమత్కారం వల్లగాని, హాస్యోక్తి వల్లగాని, అధిక్షేప స్ఫూర్తి వల్లగాని ఇందులో కవి చమత్కృతిని కల్పిస్తాడు. దానివల్ల పఠిత చక్కిలిగింత పెట్టినట్లు చకితుడు కావచ్చును గాని, హృదయం కరిగినట్లు ఆనందించలేడు. అటువంటి కవిత్వం వల్ల ఆహ్లాదం కలుగుతుంది. కాని ఆనందం కలుగదు. అందువల్ల సహృదయుడాకవిత్వాన్ని విలాస వస్తువుగా పరిగణిస్తాడు. ఆత్మీయతను అందులో పొందలేడు. మూడవ రకం అంతకన్నా ముచ్చటైనది. అది ముద్దు ముద్దుగా రచనా రమణీయకత్వంతో, భావ విన్యాసంతో పఠితలను మోహింపచేస్తుంది. ఈ కవిత మధురంగా ఉన్నా రచయిత కొక సాహిత్య దర్శనమున్న స్ఫూర్తిని కలిగించదు. తేనెలా రుచుల నందించడమే తప్ప తెలివిని మొలిపించలేదు. సుకుమార హృదయులకు ఈ కవిత సుఖాన్నిచ్చి లాలిస్తుంది. పాట విన్న పాపలా పఠిత పరవశిస్తాడిందులో.

కవి సమాజంలోని సుఖదుఃఖాల్లో కవితను ముంచి కమనీయోపదేశాన్ని పఠిత హృదయానికి సూటిగా అందించే స్వభావం కలది సామాజిక స్పృహ కలిగిన కావ్యం. పై మూడు రకాల కవితల్లో కవి సమాజాన్ని వదలి సాము గరిడీలు చేస్తాడని కాదు కాని, నాలుగో రకంలో కవి సమాజం వల్ల తాను పొందే అనుభూతిని ఒక నీతిని నిరూపించడానికి వాహికగా వాడుకుంటాడు. ఉదాహరణకు వేమన పద్యాలను తీసికొనవచ్చు.

*"అనగ నవగ రాగ మతిశయిల్లుచు నుండు*
*తినగ తినగ వేము తియ్యనౌను*
*సాధనమున పనులు సమకూరు ధరలోన*
*విశ్వదాభిరామ వినురవేమ!"*

ఈ కవితలో జీవితసత్యం చిత్తాకర్షకంగా చెప్పబడింది. సత్యాన్ని సూటిగా చెప్పినా సుందరంగా ఆవిష్కరించే పద్ధతి ఇందులో ఉంది. ఆ సౌందర్యం అలంకృతి వల్ల ఏర్పడింది. సామాజికానుభూతి వెనుక నైతిక దృక్పథం గల కవి చెప్పిన కవిత ఇలాగే ఉంటుంది. సామాజిక స్పృహలో నైతిక, ఆధ్యాత్మిక, ధార్మిక, రాజకీయ, సాంఘిక, శాస్త్ర, మార్మిక దృక్పథాలు ఇమిడి ఉంటాయి. ఆయా దృక్పథాలతో సమాజాన్ని సమీక్షిస్తూ తాననుభవించిన అనుభూతులను అందంగా ఆవిష్కరించే విధానాన్ని ఈ పద్ధతిలో చూడవచ్చు. ఈ పద్ధతిలో సూటిగా సందేశం సామాజికుని కందే వెసులుబాటు మిక్కుటంగా ఉంది. కవి పొందిన అనుభూతి అతని దృక్పథంలో ప్రతిఫలించి వాచ్యమౌతుంది. ఇందులో అనుభూతి జీవితానికి పనికి వచ్చే చిట్కాలా పనిచేస్తుంది. అందువల్ల ఈ కవితకు సూక్తి గౌరవం లభించటం సామాన్యం. ఆధునిక కవుల అభివ్యక్తికి ఇది అమితంగా ఆదరపాత్ర మౌతున్నది. నేడు సాహిత్యదర్శనాన్ని కలిగించే కవిత అన్నింటికంటే ఉత్తమమైనదిగా అభిజ్ఞులచే ఆదరింపబడుతుంది. కవి తన దృక్పథాన్ని సామాజిక స్పృహతో చెప్పబడ్డ ఏ దృక్పథమైనా సరే సాహిత్య దర్శనంగా మార్చి రమణీయంగా, వ్యంగ్య సుందరంగా కవితలో ఆవిష్కరిస్తాడీకవితలో తత్త్వాన్ని అనుభూతిగా మార్చే శక్తి ఈ కవితకు ముఖ్యం. వాచ్యంగా, సూటిగా చెప్పటం దీనికి వ్యతిరేకం. అందువల్ల కవితను కళాఖండంగా తీర్చిదిద్దేయత్నం దీనిలో కనపడుతుంది. కవి ప్రతిభకది పతాకగా నిలుస్తుంది.

మధురమైన కవిత పాలవంటిది. జీవితానుభూతి అనే అగ్నితో ఆ పాలను వేడి చేయాలి. పాలపొంగు భవ్య కవితావేశం వంటిది. పొంగే పాలు చూచే వాడికి ఉత్సాహం కలిగించినట్లు పొంగే కవిత పఠిత కావేశాన్ని కలిగిస్తుంది. ఆ పొంగు చల్లారిన తరువాత కవి తన దృక్పథమనే తోడు వేస్తాడు. పాలు పెరుగుగా తేరుకుంటాయి. ఆ పెరుగులో మజ్జిగగా మారిన పాలు ఉన్నాయి. చిలికితే పైకి తేలే వెన్న కూడా ఇమిడి ఉంది. వెన్న కవితలో రంగరించిన తత్త్వం. అందువల్లనే కవిత్వ నవనీత మంటే సాహిత్య దర్శనమని భావింపబడుతున్నది. వేడి పాలలో నుండి వెన్న తీయటమే కావ్యంలో సాహిత్య దర్శనాన్ని సమీక్షించటం.

కవితను అందంగా చెప్పటం వేరు, ఆలోచనామృతంగా అందించటం వేరు. అయితే, ఆలోచనామృతంలో అందం కూడా ఒక భాగంగా ఉంటుంది. అందాన్నే ఆరాధిస్తే పఠితకు రసికత్వం కలుగుతుంది. ఆలోచనామృతాన్ని సేవిస్తే వ్యక్తిత్వం అలవడుతుంది. పఠితకు రక్తితో పాటు వ్యక్తిత్వాన్ని కూడా కలిగించేదే ఉత్తమ కవిత.

వ్యక్తిత్వాన్ని కలిగించే కవితకు మొదట వ్యక్తిత్వం ఉండాలి. వ్యక్తిత్వానికి స్వయం ప్రకాశక శక్తి, ప్రేరకశక్తి, అనే రెండు శక్తులుంటాయి. కవితలోని స్వయం ప్రకాశక శక్తి కవిదే. కవికాశక్తి దర్శన సామర్థ్యంవల్ల కలుగుతుంది. దర్శనం అనుభవ సాంద్రత నుండి సముద్భవిస్తుంది. జీవితానుభవం చింతనామయమైనప్పుడు సాంద్రత ఏర్పడుతుంది. వాస్తవాన్ని వాస్తవంగా చెపితే కవితకు అస్తిత్వం ఉండదు. వాస్తవాన్ని కవి భావనామయం చేయాలి. సహృదయునిలో భావనామయమైన జీవితానుభవ స్ఫూర్తిని కలిగించాలి. సాహిత్యంలో అనుభవ మెప్పుడూ అలౌకికమే.

వాస్తవంలోని సుఖదుఃఖస్పర్శ సాహిత్యంలో ఆనంద స్పర్శతో అమృతమౌతుంది. జీవితానుభవాల కన్నింటికీ అన్వయం దొరకటం అసాధ్యం. అనుభవాలన్నీ ప్రతివ్యక్తీ అనుభవిస్తాడన్నదీ అనూహ్యం. అనుభూత జీవితానుభవాలు మేల్కొన్న జీవ సంస్కారాలు. అననుభూత జీవితానుభవాలు కవితలో అలౌకికంగా అనువదింపబడే అనుభవసత్యాలు. అనుభూత జీవితానుభూతులు కవితలో ఆస్వాదింపబడుతున్నప్పుడు అభినవ రుచులను పఠితకు అందజేస్తాయి. అననుభూత జీవితానుభూతులు ఆస్వాదింపబడుతున్నప్పుడు అవ్యక్త మాధురీరుచులను అందజేస్తాయి. అభినవ రుచుల్లోనూ, అవ్యక్త మాధురీ రుచుల్లోనూ పఠిత కవి స్వీయవ్యక్తిత్వంతో దర్శించి, విమర్శించి, ఆవిష్కరించిన సాహిత్య దర్శనాన్ని సమీక్షింప గలుగుతాడు. తన దర్శనం తనకుండగా కవి దర్శనంతో సంవదించి, తన్మయుడౌతాడు. వ్యక్తి విశ్వజనీనతను అందుకొనే వివేకమార్గం కవితగా రాణిస్తుంది. భౌతికమైన వ్యక్తి భావనామయంగా మారి బ్రహ్మాండాన్ని వ్యాపించే ప్రక్రియను అలవరచుకొంటాడు. కవిత అనే వాహిక ద్వారా సహృదయానుభూతి తరంగిణిగా ప్రవహించి తత్త్వమనే సముద్రంలో సహృదయుడు లీనమౌతాడు. అనుభూతి అక్షరశిల్పంగా మార్చేవాడు కవి; అక్షరశిల్పంలోని అద్వైతత్త్వంగా మిగిలేవాడు సహృదయుడు. అంటే కవితలో కవి దర్శనాన్ని సౌందర్యంగా ఆవిష్కరిస్తున్నాడు. సహృదయుడు సౌందర్యాన్ని దర్శనంగా ఆస్వాదిస్తున్నాడు. విమర్శకుడు సౌందర్యాన్నీ దర్శనాన్నీ వివేచించి అనుశీలిస్తున్నాడు.

దర్శనానికీ దృక్పథానికీ భేదమున్నది. దర్శనం మానవుని శీలంలాంటిది. దృక్పథం గుణం లాంటిది. శీలం సార్వకాలికం; గుణం సాపేక్షం. దేశ కాల పాత్రలననుసరించి తనదైన చూపుతో లోకాన్ని సమీక్షించేది దృక్పథం. కవి దృక్పథానికి తాత్త్విక వ్యక్తిత్వాన్ని కల్పించేది దర్శనం. దృక్పథం కవితను ఒక మార్గంలో నడుపుతుంది; దర్శనం కవితకు నడిచేశక్తినీ, దర్శనం సత్త్వశక్తినీ, ప్రసాదిస్తుంది. దృక్పథం కలకాలం నిలువకపోవచ్చును, విశ్వజనీనతను భజింపక పోవచ్చునుగాని, దర్శనం కాలాతీత వ్యక్తిలా భాసిస్తుంది. దృక్పథం ఆదరణ ప్రవృత్తిని కలిగిస్తే, దర్శనం కవితకు ఆత్మాభివ్యక్తిని అందిస్తుంది. కవిత కెంత మాధుర్యమున్నా, సామాజిక స్పృహ ఉన్నా, దర్శనం లేకపోతే దయనీయ స్థితిలో నిలిచిపోతుంది. శ్రీ అరవిందులన్నట్లు. "Art is not only technique or form of beauty, not only the discovery or the expression of beauty - it is the self expression of consciousness under the conditions of aesthetic vision and perfect execution."

ఆధునికాంధ్ర సాహిత్య జగత్తులో విశ్వనాథ ఒక విరాణ్మూర్తి. వచన కవిత్వాన్ని వినా ప్రాచీనాధునికాంధ్ర ప్రక్రియల్లో ఆయన చేపట్టని ప్రక్రియలేదు. పట్టింది బంగారం చేయని పట్టులేదు. గేయం వ్రాసినా పద్యం రచించినా ముక్తకం వ్రాసినా మహాకావ్యాన్ని రచించినా విశ్వనాథకృతిలో ఆయనదైన ఒక వ్యక్తిత్వం ప్రతిబింబిస్తోంది. వాక్కులో వాక్యంలో శబ్దంలో, సమాసంలో భావంలో, భావనలో, దర్శనంలో, విమర్శనంలో భాషణలో భూషణంలో ఒకవైలక్ష్యం వెల్లివిరుస్తుంది.
- జి.వి.యస్. (విశ్వనాథ కవితావైభవం)

జనవరి 1981

# "ఇంట గెలిచి రచ్చ గెలువు"

ప్రపంచ తెలుగు మహాసభలు కాలక్షేపం కోసం జరిగే సమావేశాలు కావు. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న తెలుగువారి సాంస్కృతిక పునరుజ్జీవనానికి తెలుగువారు నిర్మాణాత్మకంగా సాగిస్తున్న ఉద్యమమని భావించాలి. వేర్పాటు ఉద్యమాలతో రాష్ట్రంలోని భావ సమైక్యత కుంటుపడుతున్న సమయంలో, తెలుగు నాయకుల నీతి చాతుర్యంతోనూ, కేంద్ర నాయకుల దూరదృష్టితోనూ ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రం ఐక్యతతో ముందడుగువేసే సముచిత మార్గం ఏర్పడటం ముదావహం. రాష్ట్రదృక్పథంతోపాటు అంతర్జాతీయ దృక్పథాన్ని ఆంధ్రులకందించి విశ్వసౌభ్రాతృత్వభావాన్ని జాతికి కల్పించి తెలుగువారి సమైక్యతను పటిష్టం చేయటానికి మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు ఎంతో ఉపకరించాయి. మొదటిసారి రాష్ట్రేతర ప్రాంతాల్లోనూ, విదేశాలలోనూ నివసిస్తున్న తెలుగువారి సమస్యలను సదవగాహన దృష్టితో సమీక్షించి సాంస్కృతిక సంబంధాలను పెంచుకోవటానికి ఆలోచించే అవకాశాలను ఆ సభలు కల్పించాయి. దాని ఫలితంగా అంతర్జాతీయ తెలుగు సంస్థ స్థాపింపబడింది. ప్రవాసాంధ్రులకూ, విదేశాంధ్రులకూ, రాష్ట్రప్రజలకూ మధ్య ఈ సంస్థ రాయబారిగా, సమన్వయ వ్యవస్థగా కృషి చేస్తోంది. దాన్ని ఆ లక్ష్యాన్ని సాధించే శక్తిమంతమైన సాధనంగా రూపొందించుకోవటం తెలుగువారి కర్తవ్యం.

మొదటి ప్రపంచ తెలుగు మహా సభలు ఆంధ్రప్రదేశ్ రాజధానిలో జరగటం సముచితం. వివిధ దేశాలనుండి, రాష్ట్రాలనుండి, ప్రాంతాలనుండి ప్రతినిధులు ఆ సభలకు వచ్చారు. వారి సమస్యలను మొదటిసారి ఒక వేదిక మీద చర్చించారు. ప్రపంచ సంబంధాలను విస్తృతం చేసికోవటానికి ప్రాతిపదికలు వేశారు. విదేశ ప్రతినిధి వర్గాలలో సంఖ్యలో పెద్దది మలేసియా ఆంధ్రసంఘప్రతినిధివర్గం. వారు రెండవ మహాసభలను మలేషియాలో జరపండని తెలుగువారికి ఆహ్వానం అందించారు. కొన్ని కారణాలవలన సభలు ఆలస్యంగా జరిగినా, ఏప్రిల్ 14 నుండి 18వ తేదీవరకు కోలలంపూరులో రెండవ మహాసభలు విజయవంతంగా నిర్వహింపబడినాయి.

మలేసియా మహాసభలు విదేశంలో మొదటిసారిగా జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలు. స్వరాష్ట్రంలో సభలు జరిపితే ఎదురయ్యే సమస్యలను తెలుసుకొన్న తెలుగు వారు విదేశాల్లో సభలు జరిగితే ఉత్పన్నమయ్యే సమస్యలను మొదటిసారి అర్థం చేసికొన్నారు. అంతర్జాతీయ తెలుగు సంస్థ మలేసియా ఆంధ్రసంఘంతో కలిసి సంయుక్తంగా నిర్వహించిన ఆ సభలు ఎన్నో క్రొత్త అనుభవాలను వెలుగులోకి తెచ్చింది.

అయిదేళ్లుగా అంతర్జాతీయ తెలుగు సంస్థ ప్రవాసాంధ్రుల స్థితిగతులను గురించీ, విదేశాంధ్రుల సమస్యలను గురించీ యథాశక్తి సమాచారాన్ని సేకరించటమే కాకుండా, పరస్పర అవగాహనను పెంపొందించే సదస్సులను నిర్వహించటంతోపాటు, ఆయా దేశాలలో, ప్రాంతాలలో సాంస్కృతిక వికాసానికి అవసరమైన సహాయ సహకారాలను అందించటంలో కృషి సాగించటం మొదలు పెట్టింది.

విదేశాంధ్రుల విషయ సేకరణం ఒక యెత్తు; వారితో ప్రత్యక్ష పరిచయం కలగటం మరో యెత్తు. మలేసియాలో ఒకటిన్నర లక్షమంది తెలుగువారు నివసిస్తున్నారు. వారు ఆ దేశ పౌరులు. ఆ దేశ స్వతంత్ర ప్రతిపత్తికి అంకితమైన దేశభక్తులు. మలేసియా స్వతంత్ర దేశమైన తరువాత ఆ దేశ పౌరులు తమ దేశ ఆర్థిక, సాంస్కృతిక పునరుజ్జీవనానికి అహోరాత్రులు కృషిచేస్తున్నారు.

అందులో అక్కడి తెలుగువారి పాత్ర గణనీయంగా ఉంది. మలేసియా సంస్కృతి రూపకల్పనలో తెలుగు సంస్కృతి పాత్రను ఉజ్జ్వలంగా నిర్వహింపచేయాలని అక్కడి తెలుగువారి ఆకాంక్ష. ఆ లక్ష్యాన్ని సాధించటానికి తెలుగువారి వెలుగు సహకారాన్ని మానసికంగా వారు ఆహ్వానిస్తున్నారు.

అటువంటి తరుణంలో రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు ఒక ఆశాకిరణంగా వారికి స్ఫురించాయి. తూర్పు, ఆగ్నేయ ఆసియా దేశాలలో భారతీయులకూ, తెలుగువారికీ ఎన్నో తరాలనుండి వ్యాపార, రాజకీయ, సాంస్కృతిక, మత విషయకమైన సంబంధ బాంధవ్యాలు ఉన్నాయి. వాటి స్వరూప స్వభావాలను చారిత్రాత్మక అధ్యయనం ద్వారా శాస్త్రీయంగా రూపొందించుకొని, ఆధునిక అవసరాలకు అనుగుణంగా వాటిని పునర్నిర్మించుకొనే అవకాశాలు ఎన్నో ఉన్నాయి. ఆ రంగంలో తెలుగు వారు క్రొత్త బాటలను అన్వేషింపవలసి ఉంది. చారిత్రాత్మకమైన అటువంటి నవ్యాధ్యాయానికి నాంది నాలపించడానికి రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు తోడ్పడగలవని విజ్ఞులు భావించారు. మలేసియాలో సభలు జరుపుకోవటానికి సంకల్పించారు.

మలేసియా తెలుగు వారి చరిత్ర ఒక సాహసమైన పోరాటం లాంటిది. దాన్ని మూడు అంచలుగా వింగడించవచ్చు. మొదటి అధ్యాయం తెలుగు వారు కొందరు రబ్బరు తోటలలో పని చేయటానికై మలేసియాకు వలసపోయిన ఉదంతం. ఎన్నో బంగారుకలలతో పోయిన ఆ కూలీలు బానిసలుగా మారిపోయిన విషాదగాథలు తెలుగు వారి హృదయాలను కరిగించివేస్తాయి. విదేశీ యజమానుల ఆధిపత్యంలో వారు ఎన్నో అగచాట్లు పడ్డారు; కొందరు తెలుగు దేశానికి తిరిగి వచ్చారు; కొందరు అక్కడనే అసువులు కోల్పోయారు. మిగిలిన వారు కాలు నిలువద్రొక్కుకొని భవిష్యత్తును నిర్మించుకోవటానికి కంకణాలు కట్టుకొన్నారు. దానితో రెండవ అధ్యాయం ప్రారంభమైంది. కార్మికులుగా ఉన్న తెలుగు వారు తమ పిల్లలకు తెలుగు భాషను నేర్పించాలని ప్రయత్నించారు. ఎన్నో విపరీత పరిస్థితులను ఎదుర్కొని పాఠశాలలు స్థాపించుకొన్నారు. తెలుగు వారిని సమైక్యపరచుకోవటానికి మలేసియా ఆంధ్రసంఘాన్ని స్థాపించుకొన్నారు. తెలుగు భాషా సంస్కృతులను నిలుపుకోవటానికి అహోరాత్రులు కృషి చేశారు. క్రమంగా తెలుగు యువకులు చదువులు సాగించి ఉన్నత విద్యారంగాల్లోనూ, పారిశ్రామిక వ్యవసాయ, రాజకీయాది రంగాల్లోనూ ప్రవేశించారు. కేంద్ర ప్రభుత్వంలో కూడా కొన్ని స్థానాలు గడించుకొన్నారు. పరస్పర సహకార భావాన్ని పెంపొందించుకొని సాటి తమిళ సోదరుల్లాగా, భారతీయుల్లాగా, విదేశ సోదరుల్లాగా ముందంజవేయటానికి ఉద్యమించారు. దీనితో మూడవ అధ్యాయం ప్రారంభమైంది. మలేసియా దేశ సంస్కృతి పునర్నిర్మాణంలో తెలుగువారు తమ సంస్కృతి వ్యక్తిత్వాన్ని సముచితంగా సంరక్షించుకొని, తద్వారా దేశ సంస్కృతికి సేవ చేయాలని దృఢ సంకల్పంతో కృషి చేస్తున్నారు.

ఈ ఉద్యమం ఇరవై అయిదేళ్లుగా సాగుతోంది. లక్ష్యాలను సాధించటానికి వారికి ఎన్నో సదుపాయాలు కావాలి. పాఠశాలలు, ఉపాధ్యాయులు కావాలి; పాఠ్యపుస్తకాలు కావాలి; సాహిత్య కళారంగాలలో తెలుగు సంస్కృతిని ప్రతిబింబించే ప్రయోగాలను ప్రబోధించే ఆచార్యులు కావాలి. విదేశాలలో చదువుకోదలచుకున్న విద్యార్థులకు భారతదేశంలోనూ, అందులోనూ ఆంధ్రదేశంలోనూ విద్యావకాశాలు కావాలి. ఇటువంటివి ఎన్నో సమస్యలు వారిని ఎదుర్కొంటున్నాయి. సహాయం కోసం భారతదేశం వైపూ ఆంధ్రప్రదేశ్ వైపూ వారు ఎదురుచూడటం సహజం. వారు ప్రధానంగా కోరేది ఆర్థిక సహాయం కాదు; హార్దికమైన సహకారభావం.

మలేసియాలో ముస్లిములకు మసీదులున్నాయి. క్రైస్తవులకు చర్చి మందిరాలున్నాయి. బౌద్ధులకు బుద్ధమందిరాలున్నాయి. తమిళులు మురగన్ దేవాలయాలు నిర్మించుకున్నారు. తెలుగు వారిలో కూడా అన్ని మతాలవారూ ఉన్నారు. తెలుగు వారి హృదయాలలో నెలవు చేసికొన్న వేంకటేశ్వర స్వామి, సీతారాములు మొదలైన దేవతలకు దేవాలయాలు నిర్మించుకోవాలని యత్నాలు చేస్తున్నారు. తెలుగుదనం జీవిత ప్రాంగణంలో తొంగిచూడాలని వారు కలలు కంటున్నారు.

మలేసియా ఆంధ్రసంఘం రజతోత్సవాలు వచ్చాయి. ఆ సందర్భంలో రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు అక్కడ జరిగాయి. మలేసియాలోని తెలుగువారికి రెండు పండుగలు ఒకేసారి వచ్చినట్లయింది. ఆంధ్రప్రదేశ్ నుండి, భారత దేశం నుండి, విదేశాల నుండీ తెలుగువారు వస్తున్నారని మలేసియా నలుమూలల నుండి ఆంధ్ర సంఘశాఖల సభ్యులేకాక, ఎంతోమంది తెలుగువారు ఆబాలగోపాలం తియ్యని తెలుగుభాషను చెవులారా విందామనీ, తెలుగు వెలుగులను కన్నులారా చూద్దామనీ సభాప్రాంగణానికి తండోపతండాలుగా వచ్చారు. మన ప్రతినిధులు ఇంగ్లీషులో మాట్లాడినా, ఉరుదులో ముచ్చటించినా, మిశ్రమభాషలో సంభాషించినా 'అచ్చమైన' తెలుగులో మాట్లాడండి, తెలుగు తియ్యదనాన్ని మాకు రుచి చూపించండి అని మరీ మరీ కోరారు మలేసియాంధ్రులు. వారికి దేవుడనేవాడెవడైనా ఉన్నాడో లేడో తెలియదు కాని 'తెలుగుతల్లి' వారికి ఆరాధ్యదైవం. వారు వేసే ప్రతి ముందడుగూ తెలుగుతల్లి దయవలన కలిగిన అభ్యుదయంగా భావించటం చూస్తే మనకే ఎంతో ముచ్చట వేస్తుంది. మాతృభాషాభిమానం మూర్తి కట్టిన బిడ్డలు మలేసియా తెలుగు ప్రజలు.

రెండవ ప్రపంచ తెలుగు మహాసభల కార్యక్రమాలను ప్రధానంగా మూడు విధాలుగా విభజించవచ్చును. మొదటిది - సభల సాధారణ సమావేశాలు, రెండవది - చర్చా సదస్సులు, ప్రదర్శనలు. మూడవది - సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలు. ప్రారంభోత్సవం, తెలుగు వెలుగుల పరిచయ కార్యక్రమం, ఆంధ్ర సంఘ రజతోత్సవ సమావేశాలు, ముగింపు సమావేశం మొదలైనవి మొదటి విభాగంలో జరిగినవి. వీటివల్ల మలేసియా ప్రభుత్వం, తెలుగుప్రజ సభల్లో పాల్గొన్న తెలుగువారిని పరిచయం చేసుకోవటానికీ, పరస్పరాభిప్రాయ ప్రకటనలు చేసుకోవటానికీ, పరస్పర సహకారావకాశాలను సమీక్షించుకోవటానికి వీలుకలిగింది. చర్చా సదస్సులవలన భారత దేశానికీ, ప్రత్యేకంగా తెలుగునేలకూ తూర్పు, ఆగ్నేయాసియా దేశాలకూ ఉన్న తరతరాల సంబంధాలను సమీక్షించుకోవటానికి అవకాశం కలిగింది. నడుస్తున్న చరిత్రను, సాహిత్య సాంస్కృతిక కళారంగాల ప్రగతిని సమీక్షించుకొని భావికార్యక్రమాలను, ప్రణాళికలను రూపొందించుకోవటానికి మార్గాలు అన్వేషించటం జరిగింది. తరతరాల తెలుగు సంస్కృతిని చిత్రించే ప్రదర్శన ప్రధానంగా ఆగ్నేయాసియా దేశాలతోడి చారిత్రాత్మక సంబంధాల అధ్యయనానికి ఎన్నో ఆకారాలను సేకరించి సమగ్ర చరిత్రను నిర్మించుకోవలసిన అవసరం ఉన్నదని స్పష్టం చేసింది. కవి సమ్మేళనంలో ప్రపంచ తెలుగు సోదరుల సమైక్య కంఠం వినిపించింది. సాంస్కృతిక ప్రదర్శనాలలో మలేసియా కళారంగ విశేషాలు ఎన్నో మనవారు తెలిసికొన్నారు. తెలుగు కళాప్రదర్శనలను మలేసియా వారు ఆత్మీయతతో అనుశీలించారు. శాస్త్రీయబాణీలలో కంటే జానపద కళాప్రక్రియల్లో పరస్పర వినిమయానికి ఎంతో అవకాశం ఉన్నదని కళాకారులు గమనించారు. అన్నింటికంటే విశేషంగా మలేషియా తెలుగువారి వ్యవహార భాషను

భాషాశాస్త్ర రీత్యా విశ్లేషించి వివేచించే అవకాశాలుగా భాషా సాహితీవేత్తలు భావించారు. ఇదంతా నిశ్శబ్దంగా తెలుగువారి హృదయాలు రికార్డు చేసికొన్న సాంస్కృతిక వికాస వీచికల ప్రకాశ ప్రసారం. దీని విలువలను నిశ్చయించుకొని, నిర్మాణాత్మకంగా ఈ అవగాహనను మలచుకోవలసిన బాధ్యత తెలుగు వారి మీద ఉంది.

ప్రపంచ తెలుగు మహాసభలలో నిర్వహింపబడిన కార్యక్రమాలనన్నింటినీ రికార్డు చేశారనే అనుకుంటున్నాం. మొదటి మహాసభల కార్యక్రమాలను, చర్చాసదస్సులనూ, నిర్ణయాలనూ ప్రచురించి ఉన్నట్లయితే ఇంకా బాగుండేది. ఇప్పటికీ మించి పోయిందేమీ లేదు. రెండు మహాసభల వివరాలను, విశేషాలను, నిర్ణయాలనూ, సూచనలనూ వివిధ రంగాలలోని విజ్ఞులవలన సేకరించి ప్రచురించటం ఉచితం. చర్చా సదస్సులన్నీ మహాసభల్లో టేప్ చేయబడినాయి, అందులో చదువబడిన వ్యాసాలు కొన్ని ముద్రింపబడినాయి. అయినా కొద్ది ప్రతులు మాత్రమే తయారు చేయబడినాయి. ముద్రితాముద్రిత పత్రాలనన్నీ కలిపి ప్రకటించటం అవసరం. ఎంతో ఉత్సాహంతో, ఎంతో వ్యయంతో మహాసభలు జరుపుకొని, వాటి వలన జాతి పొందే ఫలితాలను నిర్మాణాత్మకంగా రూపొందించుకోవటంలో నిర్లక్ష్యం చేస్తే - ఈ సభల ప్రయోజనాలను ఈనగాచి నక్కలపాలు చేసినట్లవుతుంది.

మహాసభలు ముచ్చటకోసం చేసికొనే వేడుకలు కావు. సన్మానాలకోసం జరుపుకొనే సమావేశాలు కావు. చర్చలకోసం, నిర్మాణాత్మక కార్యక్రమాలను రూపొందించటం కోసం, ప్రపంచ తెలుగు సంస్కృతి పునర్వికాసంకోసం సాగించే ఉద్యమాలు. విదేశాల్లో జరుపుకునే సభల్లో ఏవో కొన్ని ఇబ్బందులు కలిగాయని మడికట్టుకొని మన రాష్ట్రంలోనే జరుపుకొందామనుకోవటం అభ్యుదయశీలం కాదు. సమస్యల సదవగాహనతో నిర్వహణ సామర్థ్యాన్ని పెంచుకొని, గడించిన అనుభవంతో చేసిన తప్పులను సరిదిద్దుకొని, అంతర్జాతీయ వికాసానికి దోహదం చేయాలే కాని, ఆవేశాలతో ఆ వ్యవస్థను పరిమితం చేయరాదు. ప్రతి మహాసభల్లోనూ తెలుగువారు ఒక నిర్దిష్టమైన ప్రయోజనం సాధించటానికి యత్నించాలి. రెండవ ప్రపంచ తెలుగు మహాసభల ద్వారా తూర్పు, ఆగ్నేయ ఆసియా దేశాలలో నివసిస్తున్న తెలుగు వారి స్థితిగతులను అవగాహన చేసుకొని, పరస్పర సహకార భావాన్ని ఆలంబనంగా చేసికొని, ఆ ప్రాంతపు తెలుగువారి సాంస్కృతిక పునరుజ్జీవనానికి తెలుగువారు సామూహికంగా ఎటువంటి సంఘటిత కృషి చేయటానికి వీలున్నదో ప్రణాళికను సిద్ధం చేసికోవాలి.

'ఇంట గెలిచి రచ్చ గెలువు' అన్నది తెలుగు సామెత. ప్రపంచ తెలుగు మహాసభలు మన ఇంట్లోనే మొదలయ్యాయి. వాటి వ్యవస్థను గురించీ, సాధనను గురించీ, లక్ష్యాలను గురించీ, కార్యక్రమాలను గురించి, నిర్దిష్టమైన అవగాహన, ముందుచూపు, ప్రణాళికా రూపకల్పనం మొదట ఏర్పరచుకోవటం మనం ఇంటిలో సాధించే గెలుపు. విదేశాలలో కాని, వివిధ రాష్ట్రాలలో గానీ మహాసభలు జరుపుకొని, వాటి వలన విశ్వాంధ్ర సాంస్కృతిక సమైక్య భావాన్ని అంచలంచలుగా సాధించే ప్రయత్నాన్ని అర్థవంతంగా సాగించటం రచ్చలో మనం సాధించే గెలుపు. ఇల్లు చక్కబెట్టుకుంటూ ఇలాతలంవైపు చూపు సారించటానికి ప్రపంచ తెలుగు మహాసభలు ప్రయోజనాత్మకమైన ఉద్యమాలని భావించటం తెలుగు వారికి అవసరం. మూలచ్ఛేదాన్ని చేసే విమర్శకంటే ముందు చూపునిచ్చే విమర్శ భవిష్యత్తుకు వెలుగుబాట!

*ఏప్రిల్ 1981*



జి.వి. సుబ్రహ్మణ్యం

# లక్షణసూక్తం

ఆధునికాంధ్ర సాహిత్యంలో మానవతావాదాన్ని మన్నించి వెలువడుతున్న వచనకవితా ప్రక్రియలో ఒక మహాకావ్యం వస్తే అది ఎలా ఉంటుంది? - ఎలా ఉండటానికి వీలుంటుంది? ఇది సాహితీలోకానికి ఆసక్తిదాయకమైన ప్రశ్న.

'నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలైతే
నేటి మహాకావ్యం పద్దెనిమిది పేజీలే'

అన్నాడు శ్రీశ్రీ. అంటే ఆధునిక మహాకావ్యానికి పరిమాణంకాదు; ప్రయోగమే ప్రమాణం. వస్తువిస్తారం కంటే వస్తుసారమే నేటి కావ్యానికి గౌరవం.

ఆధునిక కావ్యంలో అనుశీలించవలసిన అంశాలు ముఖ్యంగా మూడు. 1.వస్తువు లేదా ప్రతిపాద్యాంశం. 2. ప్రక్రియ. 3. కవితాశిల్పం. ఈ మూడింటిలో అభ్యుదయ వాదులు మొదటి అంశానికి ప్రాముఖ్య మిస్తున్నారు. అందులో కొందరు మార్క్సిస్ట్ దృక్పథంతో ఎన్నుకొన్న వస్తువే, అది సమాజానికి అందించే సందేశమే ముఖ్యమని భావిస్తుంటే, మరికొందరు మానవజీవితప్రగతికి దోహదమిచ్చే ఏ అంగాన్నైనా వస్తువుగా ఎన్నుకోవచ్చునని సంభావిస్తున్నారు. ఏ దృక్పథంతో రచించినా దానికి సామాజిక స్పృహ తప్పకుండా ఉండాలని చాలామంది అంగీకరిస్తున్నారు. సామాజిక స్పృహతో పాటు సాహిత్య స్పృహకు కూడా సముచితమైన స్థాన మివ్వాలని మరికొందరు అంటున్నారు. ఈ లక్షణాలన్నీ ఉన్నా రచయిత వస్తువు నెన్నుకొనేటప్పుడు సామాజిక, ఆర్థిక, రాజకీయాది దృక్పథాలతోపాటు సాహిత్య దర్శనం కూడా ఉంటే తప్ప ప్రయోగానికి కావ్యగౌరవం రాదని కొందరు వివేచిస్తున్నారు. ఈ వాద కోలాహలంలో ఒక మహాకావ్యానికి వస్తువు ఎలా ఉండాలి? అనే ప్రశ్నకు సమాధానం చెప్పగల ఒక ప్రయోగం వస్తే పరిశీలించాలని సాహితీలోకం తహతహలాడుతున్నది.

ఇట్టి తరుణంలో డా॥సి. నారాయణరెడ్డిగారి 'విశ్వంభర' 1980సం. డిసెంబరులో వెలువడింది. ఇది సాహితీలోకంలో ఒక సంచలనాన్ని కలిగించిదనటంలో సందేహం లేదు. రచయిత మాటలో - "ఈ కావ్యానికి నాయకుడు మానవుడు. రంగస్థలం విశాలవిశ్వంభర. ఇతివృత్తం - తేదీలతో నిమిత్తం లేని, పేర్లతో అగత్యంలేని మనిషి కథ. ఈ కథకు నేపథ్యం ప్రకృతి... ఆదిమ దశ నుంచీ ఆధునిక దశవరకు మనిషి చేసిన ప్రస్థానాలు ఈ కావ్యంలోని ప్రకరణాలు" ఇది 'వచనకవితలో సమగ్రకావ్యం.'

'ఆధునికాంధ్ర కవిత్వంలో సంప్రదాయం - ప్రయోగం' అన్న అంశం మీద సాధికారికమైన సిద్ధాంతవ్యాసాన్ని రచించిన రచయిత డా॥సి. నారాయణరెడ్డిగారు, ప్రయోగాన్ని గురించి పరిశోధించిన విద్వత్కవి. వారి 'విశ్వంభర' సమకాలీన ఆంధ్ర కవిత్వంలో వచన ప్రకియలో వెలువడిన ఆధునిక మహాకావ్యం. మానవతా వాద ప్రస్థానంలో ఒక మణిదీపం.

డా॥సి. నారాయణరెడ్డి గారి సాహితీవ్యక్తిత్వంలో ఒక ప్రత్యేకత ఉంది. తాము జీవిస్తున్న సమకాలీన సమాజంలో జరుగుతున్న సంఘటనలకు స్పందించి కళామయంగా వ్యంగ్యసుందరంగా

కావ్యఖండికలను రచించటం, సాహితీజగత్తులో తలయెత్తుతున్న ఆధునిక కవిత్వోద్యమాలను మానవతాదృక్పథంతో సమీక్షించి తన మార్గాన్ని కవిత్వంలో ప్రపంచించటం, ప్రతి ప్రక్రియవెనుకనున్న తత్త్వాన్ని పరిశీలించి మానవతామహాప్రస్థానంలో అది యే పరిణామదశా విస్ఫూర్తిని వెలారుస్తుందో వివేచించటం, భావాభివ్యక్తికి తగిన ప్రక్రియను ఎన్నుకొని శిల్పసుందరంగా నిర్మించటం, ఉక్తి చమత్కారానికి ఊపిరిగా ప్రతీకాత్మక అభివ్యక్తిని సంవదించటం, ఆసక్తిని పోషిస్తూ ఆమూలాగ్రం రచనను నిర్వహించటం మొదలైన ముఖ్య లక్షణాలు రెడ్డిగారి కవితకు ఒక వ్యక్తిత్వాన్ని సంతరించి పెట్టాయి. వీటికితోడు సంప్రదాయబలం, ప్రయోగనిర్వహణంలో ప్రతిభ వారికి అండదండలుగా నిలిచాయి. ఈ సంశ్లిష్ట వ్యక్తిత్వమే వారి చేత ఒక సమగ్ర కావ్యాన్ని రచింప చేసింది.

వ్యవస్థ మీద అభ్యుదయ శక్తుల తిరుగుబాటే ఆధునిక కావ్యాలను వస్తువును ప్రసాదిస్తున్నది. ఆ అభ్యుదయ శక్తిని మానవుడుగా సంకేతించటం ఆధునిక లక్షణం. మనిషిలోనే వ్యవస్థా, తిరుగుబాటు కనపడుతున్నాయి. ఇది సమాజ పరంగా ఒక విధమైన ప్రస్థానం. అది వర్గ సంఘర్షణగా వ్యక్తమౌతుంది. కొన్ని చోట్ల వర్గసంఘర్షణగా కనబడుతున్నది. వ్యక్తి పరంగా సాగితే అంతస్సంఘర్షణ అవుతున్నది. ఇది మరో విధమైన ప్రస్థానం. భౌతికంగా కనబడుతున్న ఈ మూడు విధాల సంఘర్షణలను తాత్త్వికంగా దర్శిస్తే ప్రకృతిలో అంతర్భాగమైన మనిషి జరిపే అభ్యుదయ ప్రస్థానంగా గోచరిస్తుంది. సమాజ ప్రస్థానంలో కూడా తిరుగుబాటు తెచ్చేది మానవుడే. వ్యక్తి ప్రస్థానంలోనూ తిరగబడేది మానవుడే. ఒక చోట సంఘానికి ప్రతీక మానవుడౌ తున్నాడు. మరోచోట స్వభావానికి ప్రతీక మానవుడౌతున్నాడు. ఏ విధంగా చూచినా మానవ చరిత్రకు మానవుడే నాయకుడు. అందువల్లనే 'విశ్వంభర' కావ్యంలో మానవుడే నాయకుడయ్యాడు.

ప్రతి తిరుగుబాటుకూ ఒక నాయకుడుండక తప్పదు. నాయకుడు ఒక అభ్యుదయానికి మార్గదర్శి. నడిపేవాడూ వాడి వెంట నడిచేవాడూ ఉండడం సహజం. అయితే వారిద్దరి చైతన్యమూ, ప్రవృత్తి ఒకటే. వ్యక్తులుగా వ్యపదేశిస్తే వేరౌతారు కాని శక్తులుగా నివేదిస్తే ప్రతీకలౌతారు. ఆధునిక కావ్యం వ్యక్తులను వ్యపదేశించి చెప్పదు. శక్తులను గుర్తించి ప్రతీకలుగా ప్రపంచిస్తుంది. ప్రవృత్తులు, ప్రతీకలు నేటి కావ్యానికి వస్తు సామగ్రులు. 'విశ్వంభర' కావ్యంలో వస్తు సామగ్రిని ఎన్నుకోవటంలో ఇట్టి వైలక్షణ్యం కనపడుతుంది. రచయిత మాటల్లో 'కామం, క్రోధం, లోభం, మదం, ఆత్మశోధనం, ప్రకృతి శక్తుల వశీకరణం - ఇలా ఇలా ఎన్నెన్ని విభిన్న ప్రవృత్తుల్లో మనిషికి?... అలెగ్జాండర్, క్రీస్తు, అశోకుడు, సోక్రటీస్, బుద్ధుడు, లింకన్, లెనిన్, మార్క్స్, గాంధీ ఇలా ఇలా ఎన్నెన్ని రూపాలో మనిషికి?" ప్రవృత్తులకు ప్రతిరూపాలు వ్యక్తులు; వ్యక్తికి విశ్వజనీనతను కల్పించేవి ప్రతీకలు. నాయకుల నామాలు తుడిచివేస్తే కనిపించేవి ఉద్యమాలు. ఉద్యమాల ఊపిరులను పట్టుకుంటే చిక్కేవి మానవ ప్రకృతులు. ప్రకృతుల ప్రస్థానమే మానవ ప్రగతి చరిత్ర. ఈ తత్త్వాన్ని బీజంగా నిక్షేపించుకొని పెరిగింది విశ్వంభర.

మనిషిని వాస్తవంగా చూచి తాత్త్వికంగా వ్యాఖ్యానించటం విశ్వంభర కావ్యవస్తుతత్త్వం. డా॥సి. నారాయణరెడ్డిగారు దర్శించిన విశ్వంభరాతత్త్వం

"మనస్సుకు తొడుగు మనిషి
మనిషికి ఉడుపు జగతి

ఇదే విశ్వంభరాతత్త్వం
ఇదే అనంత జీవిత సత్యం"

జీవిత నాటకంలో మనస్సు ధరించే భూమికయే మనిషి. ఆ మనశ్శక్తి సాధించే కార్యమే అతని ఉద్యమం. మనసుకు ఆలంబనం మనిషి; ఆమోదం జగతి. మనశ్శక్తి వ్యక్తిగా సాగితే జీవిత చరిత్ర; సమష్టిగా సాగితే సమాజ చరిత్ర. సమిష్టిగా సాగే సాధనకు కూడా మనిషే ప్రతీక!

"మనిషి సాధన త్రిముఖం - కళాత్మకం, వైజ్ఞానికం, ఆధ్యాత్మికం" అని విశ్లేషించారు డా॥ సి. నారాయణరెడ్డిగారు. కళాసాధనలో మనిషి హృదయం, వైజ్ఞానిక సాధనలో బుద్ధి, ఆధ్యాత్మిక సాధనలో ఆత్మ క్రమంగా వికసిస్తాయి. ఈ సాధన త్రయంతోపాటు మనిషి యొక్క భౌతిక సాధన కూడా పరిగణించవలెనా లేదా అనే మీమాంస మొలకెత్త వచ్చు. భౌతికాభ్యుదయానికి మానసిక వికాసం ప్రాతిపదిక. మనిషి మానసికంగా సాధించిన ప్రగతిని భౌతికంగా ప్రయోగిస్తాడు. అందువల్ల పై త్రివిధాత్మక సాధనం మానవ భౌతిక వికాసానికి తోడుపడుతుంది. కాని భౌతిక వికాసం పై వికాసం లేనిది లేదు. కాబట్టి పై సాధన త్రయాన్నే కావ్య వస్తువుగా ఎన్నుకొన్నారు డా॥ నారాయణ రెడ్డిగారు.

మనిషి ప్రస్థానాన్ని చిత్రించవలసివస్తే ఏ పద్ధతి ననుసరించాలి అన్నది మరో ప్రశ్న. పద్ధతులు ప్రధానంగా నాలుగు. చారిత్రక పద్ధతి ఐతిహాసిక పద్ధతి, పురాణ పద్ధతి, కావ్య పద్ధతి. మహాకావ్య రచనలో మానవ ప్రస్థానం చారిత్రక పద్ధతిలో చిత్రిస్తే అది ఒక చారిత్రక కావ్యంగా రూపొందవచ్చు. అందులో తేదీలు, వ్యక్తులు, సంఘటనలు, సామాజిక చిత్రణం నిర్దిష్టంగా ఉండాలి. ఆ విధంగా మానవ ప్రగతిని చిత్రించే కావ్యం ప్రపంచ చరిత్రను వ్రాసే చారిత్రక సర్వస్వం కావచ్చు. దాన్ని నారాయణ రెడ్డిగారు గ్రహించకపోవడం ఔచిత్యం. ఐతిహాసిక పద్ధతి మానవ సమగ్ర చరిత్ర స్ఫూర్తిని కలిగియున్నా ప్రతీకాత్మకంగా, ప్రవృత్తుల చిత్రణం ప్రధానంగా ప్రపంచితమౌతుంది. ఇక పురాణపద్ధతి ప్రతిపాద్య వస్తువు యొక్క పుట్టుపూర్వోత్తరాలను దార్శనికంగా చిత్రిస్తుంది. కావ్యపద్ధతి రసవత్తర కథారూపంగా సాగుతుంది. వీటిల్లో మానవ ప్రస్థానాన్ని చిత్రింపదలచుకొన్న కవికి ఐతిహాసిక, పురాణపద్ధతులే ఉపాదేయా లౌతుంటాయి. డా॥ సి. నారాయణరెడ్డిగారీ కావ్యనిర్మాణ మర్మాన్ని గ్రహించి మానవ వికాసానికి మొదలేది? మూల మేది? అని దర్శించి, అక్కడినుండి మానవ ప్రస్థానం ఎన్ని ప్రవృత్తులతో ఎన్ని మార్గాలలో సాగిందో భావించి, ప్రతీకాత్మకంగా వచనకవితా ప్రక్రియలో రచించి ఆధునిక కావ్య స్వరూప దర్శనం కలిగించారు.

సూత్రప్రాయంగా వివేచిస్తే ఆధునిక మహాకావ్యం ఈ క్రింది లక్షణాలతో వెలుగొందుతుండాలి.

1. మానవ ప్రగతిని గాని ప్రస్థానాన్నిగాని సాధ్యమైనంతవరకు ఒక సమన్వయంతోనూ, ఒక సమగ్రతతోనూ సమీక్షించాలి.
2. వస్తువు వాచ్యంకాకుండా ప్రతీకాత్మక ప్రవృత్తితో వ్యంగ్య గౌరవాన్ని సాధించాలి.
3. ఆధునిక జీవితానికి ఒక అర్థాన్నిగాన్ని, ఒక సందేశాన్నిగాని అందించాలి.
4. ఐతిహాసిక పురాణ పద్ధతుల నాశ్రయించి సామాజికుల్లో ఒక ఆలోచన రేకెత్తింపచేయాలి.

5. ఆకృతిలో విస్తృతికంటే సారవంతమైన కళాత్మక వ్యక్తిత్వంతో కూడుకొన్న సంగ్రహత్వం గోచరించాలి.

6. రచనలో అలంకృతికంటే అర్థగౌరవం ఉండాలి. శబ్దచిత్రణం కంటే అర్థశబలత భాసించాలి. అలంకారాలు ఉన్నా అవి అర్థాన్ని పోషించాలి.

7. అభివ్యక్తి ఆత్మాశ్రయరీతిలో గానీ, పరాశ్రయ పద్ధతిలోగాని సాగవచ్చు. అయినా ఎన్నుకొన్న పాత్రలు వ్యక్తులుగా కాకుండా ప్రవృత్తులకు, ఉద్యమాలకూ, అవస్థలకూ, సిద్ధాంతాలకూ, విలువలకూ ప్రతీకలుగా ఉండి విశ్వజనీనతను ప్రకటించాలి.

8. వర్ణనంలో స్వరూపంకంటే స్వభావానికీ, విశ్లేషణంకంటే వివేచనానికీ, తాత్పర్యంకంటే కవి దర్శనానికీ ఎక్కువ ప్రాధాన్యం ఉండాలి.

9. కవితా ఇజాలను ప్రచారం చేస్తున్నట్లు కాక నిజాలను నిత్య నూతనంగా వ్యక్తీకరిస్తున్నట్లు ఉండాలి.

10. కవితాభివ్యక్తి అనుభూతి నందిస్తూ ఆలోచన రేకెత్తించాలి.

ఈ దశ సూత్రి నేటి సహృదయుడు ఆధునిక మహాకావ్యంలో దర్శించదగిన లక్షణ సూక్తమైతే 'విశ్వంభర' ఒక ఆధునిక మహాకావ్యం.

*తెలుగు సాహిత్య చరిత్రలో **1933-34** సం॥ల కాలం చాలా ఉజ్జ్వలమైనదని చెప్పాలి. ఒకవైపు 'శ్రీశ్రీ మహాప్రస్థానం' రచనం ప్రారంభించాడు. మరియొకవైపు విశ్వనాథ 'రామాయణ కల్పవృక్షం' రచనం మొదలుపెట్టాడు. ఇద్దరూ సంఘధర్మానికి బొమ్మాబొరుసుగా ఉన్న చైతన్యాలను స్వీకరించారు. ఒకరు వర్గరహితమైన సమాజాన్ని, ఆర్థికమైన అసమానత్వాలను తొలగించి సమసమాజాన్ని నిర్మించాలని ప్రబోధించారు. ఆర్థికాభ్యుదయాన్ని సాధించినా జాతి జీవనం ఆధ్యాత్మిక ధర్మ చైతన్యంతో ముందుకు నడిచినప్పుడే మానవ వికాసం సంపూర్ణమౌతుందనీ, అది భారతీయ సంస్కృతి సముద్ధరణం వల్ల సాధింపబడుతుందనీ మరొకరు ప్రబోధించారు. ఒకరు ఆర్థిక ధర్మానికి ప్రాధాన్యమిస్తే మరొకరు హార్దిక ధర్మానికి ప్రాణం పోశారు. ఒకరు రచ్చ గెలువమని జాతి వెన్ను తడితే మరొకరు ముందు ఇంట గెలవాలని హితవు చెప్పారు. అభ్యుదయం ఉత్తాలమైన తరంగం. సంప్రదాయం గంభీరమైన సముద్రం. తరంగహేలను శ్రీరంగ శ్రీనివాసరావు ప్రదర్శిస్తే సముద్ర ఘోషను విశ్వనాథ సత్యనారాయణగారు ప్రపంచించినారు.*

- జి.వి.యస్. (విశ్వనాథ కల్పవృక్ష - రామాయణ సుధాలహరి)

***జులై 1981***

# కళలేని జీవితం కంకాళం

ఆంగికం భువనం యస్య
వాచికం సర్వవాజ్మయం
ఆహార్యం చంద్రతారాది
తం వందే సాత్త్వికం శివమ్॥ - అభినయదర్పణం

మన ప్రాచీనులు నాట్యాన్ని శివస్వరూపంగా భావించారు. నాట్యం అభినయ ప్రధానం. నాటకం కూడా అంతే. నాటక ప్రయోగంచేసే నటకులు నాటకంలో పాత్ర లెన్నుకుంటారు. ముందుగా పాత్రకు తగిన ఆకారం నటీనటకులకు ప్రధానంగా ఉండాలి. దీనిని ఇంగ్లీషులో Character Fitness అంటారు. పాత్రకు తగిన ఆకారం లేకపోతే రూపకంలో రూపం రూపుకట్టదు. ఆకారపుష్టి ఉన్నా అభినయం లేకపోతే 'విగ్రహపుష్టి నైవేద్యం నష్టి' అనే సామెత గుర్తుకొస్తుంది. ఆకారం అభినయానికి ఆధారం. ఆయా పాత్రల స్వభావాలను బట్టి నాయకుడెలా ఉండాలి, నాయిక ఎలా ఉండాలి, తదితర పాత్ర లెలా ఉండాలి, అని దర్శకుడు మొదట నిర్ణయిస్తాడు. ఇది ఎంత ప్రాథమికమో అంత ప్రధానం. సామాన్యంగా కురుక్షేత్రం నాటకం ప్రయోగించేటప్పుడు పాండవ పాత్రల్లో నకుల సహదేవ పాత్రలను ఎన్నిక చేయటంలో అంత శ్రద్ధ వహించరు. వారిద్దరూ అశ్వినీ దేవతల అందాన్ని పుట్టుకతో తెచ్చుకొన్నారు. సామాన్యంగా ఆ పాత్రలు కురూపులుగా మన తెలుగు పౌరాణిక రంగం మీద కనపడతారు. 'రాగం పాడితే చాలు రూపమెలా ఉన్నా సరిపెట్టుకోవచ్చు' అనే తెలుగు వారి సహృదయత దానికి దోహదం చేస్తోంది.

ఆంగికాభినయం తరువాత వాచికాభినయాన్ని పేర్కొంటారు. దీనినే ఇంగ్లీషులో 'డైలాగ్ డెలివరీ' అంటారు. పాత్ర చూడముచ్చటగా ఉన్నా నోరు తెరిస్తే గబ్బు కొట్ట కూడదు. భావానికి ఉచితంగా సంభాషణం చేసే నేర్పు ఉండాలి. నవ్వగలగడం ఎంత గొప్పతనమో నవ్వుతూ మాట్లాడ గలగటం కూడా అంతే గొప్పతనం. భావాన్ని సక్రమంగా వ్యక్తీకరించలేకపోతే పాత్రనవ్వులపాలై పోతుంది. చాలాసార్లు మనం రంగస్థల నాటకాల్లో, రేడియో నాటకాల్లో, టి.వి. నాటకాల్లో పాత్రలు సంభాషణలను బట్టీపెట్టి ఒప్పచెపుతున్నట్లుగా అభినయించటం చూస్తాం. దానివల్ల ఏమి మాట్లాడుతున్నాడో తెలుస్తుంది. కాని ఎలా మాట్లాడాలనో తెలియదు వినేవాడికి, చూసేవాడికి మాట మనసుకు మణిదర్పణం లాంటిది. మనసులోని భావాన్ని వ్యక్తం చేయలేని మాట మట్టిలో మణిదర్పణం లాంటిది. మనసులోని భావాన్ని వ్యక్తం చేయలేని మాట మట్టిలో పోసిన పన్నీరు. అందువల్ల దర్శకుడు సంభాషణలను పాత్రలచేత పలికించే తరిఫీదుకు తగినంత ప్రాధాన్యాన్ని ఇవ్వాలి. మాటలు మాట్లాడే పాత్రకు మొదట ఆ మాటకు అర్థం తెలియాలి. 'మహామనీషి' అనవలసిన చోట 'మహామనిషి' అన్నాడనుకోండి - అన్నంలో పలుగురాయి పడ్డట్లు ప్రేక్షకులు బాధపడతారు' అలాగే - 'విద్యార్థి' అనబోయి 'విద్యార్తి' అన్నా, 'యజ్ఞం' అనబోయి 'యగ్నం' అన్నా, 'బోధ' అనబోయి 'బోద' అన్నా. 'కళ' అనబోయి 'కల' అన్నా ఉన్న అర్థంపోయి అనర్థం దాపురిస్తుంది. వాచికాభినయం సక్రమంగా లేకపోతే ఎంత ఆకారమున్నా వినేవాడికి, చూచేవాడికి వాకరవస్తుంది.

క్రమంగా తెలుగులో వాచికాభినయం మీద శ్రద్ధ తగ్గుతోంది. భాషాజ్ఞానం, భావజ్ఞానం వాచికాభినయానాకి రెండు రెక్కల్లాంటివి. ఏ రెక్క సరిగ్గా లేకపోయినా అభినయం కుంటుపడుతుంది.

ఆహార్యాభినయానికి ప్రత్యేక ప్రతిపత్తి వుంది. దీన్ని ఇంగ్లీషులో 'మేకప్' అంటారు. ఇరవైయేళ్ళ యువకుడు అరవైయేళ్ళ వృద్ధుని పాత్ర వేయవలసి వస్తే అతని కారూపాన్ని 'మేకప్' సమకూరుస్తుంది. వేషానికి తగినట్లుగా నటించాలి, మాట్లాడాలి. కంఠస్వరం దాని కనుకూలంగా ఉండాలి. ఇరవైయేళ్లవాడు ఈసురోమని మాట్లాడినా, షష్టిపూర్తి పెళ్ళికొడుకు పహెలాపచ్చీసులా మాట్లాడినా వేషం మాత్రం వికారంగా కనపడుతుంది. వేషం రూపాన్ని మారుస్తుంది. అంటే ఒక రూపంమీద కాదు ప్రాధాన్యం, ఆరోపితరూపానికే అగ్రతాంబూలం. ఏ వేషం వేసినా నేను నేనుగానే నటిస్తాననే వారు కొందరుంటారు. వారు కళయైన రూపకానికి కళంకం తెస్తున్నారన్నమాట. పాత్రలో లీనం కావటానికి ఆహార్యం ఒక చక్కని మార్గం.

అభినయాలు నాల్గింటిలోనూ శివస్వరూపమైంది సాత్త్వికం. ఇది ఒక యోగం లాంటిది. సత్త్వమంటే సమాహిత చిత్తం. దానిలో నుండి పుట్టే అభినయం సాత్త్వికం, ఉదాహరణకు, హరిశ్చంద్ర పాత్రధారి ఉన్నాడనుకోండి. కొడుకు చనిపోయినాడని అతడు శోకించాలి. భార్యపడే అగచాట్లను చూచి బాధపడాలి. తన దీనస్థితిని భావించి ధైర్యాన్ని ప్రకటించాలి. ఆ నటుడు వేదిక మీద అభినయిస్తున్నప్పుడు భార్యాపుత్రులుగా నటించే తోటి నటీనటులు తనకు ఆత్మీయులు కారు. అయినా, అదంతా నాటకం. పై పెచ్చు ఆ నటుని అసలు భార్యాపుత్రులు నాటకశాలలో మొదటి వరుస సీట్లల్లో కూర్చొని నాటకాన్ని చూస్తున్నారే అనుకోండి. ఇక ఆ హరిశ్చంద్ర పాత్రధారికి శోకం ఎలా రావాలి? కన్నీరు కావాలంటే రాదు; కొనుక్కోవటానికి దొరకదు. గ్లిజరిన్ కళ్ళల్లో చల్లుకుంటేవచ్చేవి శోకబాష్పాలు కావు, కళ్ళు మండి కారే వేణ్ణీళ్ళు. అందువల్ల హరిశ్చంద్ర పాత్రధారి భావగతమైన తాదాత్మ్యాన్ని పాత్రలో పొందాలి. ఆ క్షణంలో అతడు నటుడు కాడు, జీవిస్తున్న పాత్ర. ఇది సమాహిత యోగం వల్ల సాధ్యమయ్యేది. హృదయం ఎప్పుడైతే భావావస్థను భజిస్తోందో కన్నీరుకాని, గగుర్పాటుకాని, స్వేదం కాని, కంపంకాని, వైవర్ణ్యం కాని, వికాసంకానీ లోపలినుండి పొంగివస్తాయి. వస్తువును వాస్తవంగా ప్రదర్శించడానికి అభినయంలో సాత్త్వికం సర్వవిధాలా అవసరం.

ఎవరో చెప్పగానో, ఎక్కడో చదవగానో విన్నాను. ఒక తెలుగు సినిమా డైరెక్టరు హాలీవుడ్‌కు వెళ్ళాడట. అక్కడ ఒక సెట్‌మీద ఒక మహారాణి ఆభిజాత్యానికి సంబంధించిన దృశ్యం చిత్రీకరింపబడుతోందట. ఆమె ఒంటినిండా బంగారపు నగలను అద్దెకు తెచ్చి అలంకరించారట! చూడవచ్చిన డైరెక్టరుకు అది చోద్యంగా తోచిందట! 'ఎందుకండీ ఇంత డబ్బుతగలేసి నగలు అద్దెకు తెచ్చారు. నకిలీ సరుకులు తగిలిస్తే సరిపోదా?' అని ఆక్షేపం చేశాడట! అక్కడి వారి సమాధానం ఇది. 'నకిలీ సొమ్ము లెన్ని పెట్టినా మగువకు బంగారం పెట్టుకొన్నప్పుడు ఇచ్చే నిండుదనం. గాంభీర్యం, గర్వం తృప్తి ముఖంలోకి రావండీ! మాకు అభినయంలో అనుభవం ప్రధానం కాని ఆదాయవ్యయాలు కావు. అభినయంలోఅనుభవం లేకపోతే అది జీవచ్ఛవంలా ఉంటుంది' అని. మరో ఉదంతం, సామ్‌సన్ బందీగా ఉన్నప్పుడు తిండి తీర్థాలు ఇవ్వకుండా శత్రువులు అతణ్ణి మల మల మాడ్చారు. ఒక బొచ్చెలో నీరు పోసి అతని ముందు చూపించేవారు. సామ్‌సన్ కన్నుల్లో దప్పిక తీర్చుకోవాలన్న తహతహ కొట్టి వచ్చినట్లు కనపడాలి ఆ ఘట్టంలో. ఆ

పాత్రధారి అభినయంలో సహజ భావాభివ్యక్తి రావటానికి ఒకరోజు ఉపవాసం చేయించి. చుక్క మంచినీరివ్వకుండా ఆ నటుణ్ణి సెట్టు మీదకు ఎక్కించారట! అచ్చమైన అనుభవం అచ్చుపోసినట్లు ముఖంమీద కనపడిందట. అప్పుడే కెమేరా చిత్రం తీసిందట. సాత్త్వికాభినయం కోసం కళాకారులు పడే శ్రమను ఈ రెండు ఘట్టాలూ కొంతవరకైనా మనకు తెలియపరుస్తాయనుకుంటాను.

ప్రతిదేశంలో ఉన్నట్లుగానే మనదేశంలో కూడా మహానటులూ ఉన్నారు;ఘామూలు నటులూ ఉన్నారు. అయితే, నటీనటకులకు సుశిక్షితమైన అభినయాన్ని నేర్పేవ్యవస్థలు మనకు తక్కువ. స్త్రీలు నాట్యం నేర్చుకొంటే భావాభివ్యక్తిలో పరిణతి కలుగుతుంది. పురుషులకూ అంతే, అయితే, నటీనటులందరూ నాట్యాన్ని నేర్చుకోవటం సాధ్యంకాదు. అభినయంలో తరిఫీదు మాత్రం తప్పక పొందాలి. ఎలా? కళ పుట్టుకతోనే వస్తుంది. నటీనటుల బాల్యావస్థలోనూ, యౌవనావస్థలోనూ ఉన్నప్పుడు వారు విద్యాలయాల్లో చదువుకొంటూ ఉంటారు. మన విద్యాలయాల్లో ఉద్యోగాలకు పనికి వచ్చే నాలుగు ముక్కలు చెప్పే వ్యవస్థ ఉన్నదే కాని అభినయాది కళలను అభివృద్ధిచేసే ప్రణాళికలు లేవు. దానితో, బడిలో రాణింపుకు రాని, పోషణలేని, తరిఫీదులేని తన కళను ఏ యువకుడూ చంపుకోలేడు. అందువల్ల బయట తనలాంటి నలుగురితో కలిసి ఒక నాటక సంఘాన్నో, కళాకేంద్రాన్నో స్థాపించుకొని, చేయి కాల్చుకొని చేయగలిగినన్ని ప్రయోగాలు చేస్తున్నాడు. సమర్థుడైన దర్శకుడు దొరకటం వాడి అదృష్టం మీద ఆధారపడి ఉంది. లేకపోతే "అనగననగ రాగ మతిశయిల్లుచునుండు" అన్న వేమన పద్యం చదువుకొంటూ వేషం కట్టవలసి వస్తోంది. ఈ మధ్య మరీ విద్యాలయాల్లో రాజకీయాలకున్న ప్రాముఖ్యం రంగస్థలానికి లేకుండా పోయింది. యువతరంలోని కళాజ్యోతి రాజకీయ ఝంఝూ మారుతానికి రెప రెప కొట్టుకొంటోంది. ఈ విపరీత పరిస్థితుల్లో కూడా కళను పోషించాలని కాలు ముందుకు వేస్తున్న యువకుల్ని మనం అభినందించాలి! వారికి ప్రోత్సాహాన్ని అందించాలి!

ఇక ఉద్యోగుల సంగతి మరీ అధ్వాన్నం. ఉద్యోగుల్లో కళాకారులుంటారు. క్రీడాకారులుంటారు. వీరిద్దరిలో క్రీడాకారులకు లభించే ప్రోత్సాహ సహకారాలు కళాకారులకులకు లభించుట లేదేమోనని అనిపిస్తుంది. వీరిమీద ఉద్యోగ బాధ్యతలు, కుటుంబ బాధ్యతలతో పాటు కళారంగ బాధ్యతలు కూడా పడుతున్నాయి. వీరు కళను పోషించకపోతే ఏమవుతుంది? అని ఎవరైనా బాధ్యతారాహిత్యంగా ప్రశ్నించవచ్చు. దేశంలో చెట్లుండి పూలు లేకపోతే ఏమవుతుంది? అని వారిని తిరిగి ప్రశ్నించాలి. 'పూలు లేకపోతే పుట్టి మునగ'దంటే ఆ అన్నవారు చేసుకున్న పుణ్యానికి ఒక నమస్కారం పెట్టి ఊరుకోవాలి!

జాతికి నాటక కళ, నృత్య కళ - అంతే కాదు లలిత కళలు సౌందర్యాన్నీ, సంస్కారాన్నీ అందించే సాత్త్విక గుణాలు. అన్నం అందరికీ కావలిసిందే, 'శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం, అన్నం తిని అందాన్ని మరచిపోలేడు మానవుడు. మనిషిలోని వెలుగు కళ. దాన్ని వెలువరించకుండా తనను తాను ఆత్మహత్య చేసుకోలేడు. మనిషిలోని మనసును నిండించేది కళ. మెదడును పండించేది జ్ఞానం. జ్ఞానానికి సాధనం కళ. జంతువులనుండి మనిషిని వేరుచేసి మన్ననకలిగించేది కళ. కళలేని జీవితం కంకాళం!

*అక్టోబర్ 1981*

# భక్తి నీరాజనం

'ఓ యమ్మ! నీ కుమారుఁడు
మా యిండ్లను బాలుపెరుగు మననీఁడమ్మా!
పోయెద మెక్కడి కైనను
మా యన్నల సురభులాన మంజులవాణీ!'

మాటలు నేర్చే పసితనంలో మా అమ్మ మాకు చెప్పిన పద్యం ఇది.

'నీ పాదకమలసేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యము నితాం
తాపార భూతదయయును
తాపసమందార! నాకు దయ సేయగదే!'

ఓనమాలు దిద్దుకొంటున్నప్పుడు మా నాన్న ఒడిలో కూర్చోబెట్టుకొని ఓపికతో నేర్పిన పద్యం ఇది.

'ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁబరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁడనాదిమధ్యలయుఁడెవ్వఁడు సర్వముఁ దానయైన వాఁ
డెవ్వఁడు వానినాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్'

బడికి పోయిననాడే మా పంతులుగారు ప్రార్థనగా పాడించిన పద్యం ఇది.

'చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు.'

మావూరి గుళ్లో పురాణం చెప్పే శాస్త్రులుగారెప్పుడూ చదివే పద్యమిది.

'నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పై
జల్లెడువాఁడు మౌళి పరిసర్పిత పింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడు మోమువాఁడొకఁడు చెల్వల మానధనంబు దోచె నో
మల్లియలార! మీ పొదలమాటున లేడుగదమ్మ! చెప్పరే!'

నా చిన్నతనంలో నా కురులుదువ్వి కొండిగట్టి దానిమీద పింఛం పెట్టి బాలకృష్ణునిగా నన్నలంకరిస్తూ ముద్దుమురిపెం చేసిన మా పెద్దక్కయ్య గొంతులో వంశీనాదంలా మ్రోగే పద్యమిది.

'మందారమకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు?'

తెలుగు విద్వాన్ చదివిన మా అన్నయ్య గొంతు విప్పితే రవళించే పద్యమిది.

'నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁగదమ్మ మేటిపె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరింబతిసేయు మమ్మ! నిన్
నమ్మిన వారి కెన్నటికి నాశము లేదు గదమ్మ! యీశ్వరీ!'

బావను తప్ప మరొకరిని పెండ్లాడనని వ్రతం పట్టిన నా శ్రీమతి పెళ్లి కాకముందు పుట్టింట్లో ప్రతిరోజు ప్రొద్దున్నే పాడుకొన్న పద్యమిది.

'తల్లీ! నిన్ను దలంచి పుస్తకము చేతంబూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లంబల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ!
ఫుల్లాబ్జాక్షి! సరస్వతీ! భగవతీ! పూర్ణేందుబింబాననా!'

ప్రతి రోజూ దైవప్రార్థన చేసికొనేటప్పుడు నేను తప్పక చదువుకునే పద్యమిది.

ఈ పద్యాష్టకం భాగవతంలో బమ్మెర పోతరాజు వ్రాసింది, అయిదు వందల యేండ్ల క్రితం భాగవతం నా బ్రతుకులో ఎంతగా అల్లుకొని పోయింది! నేనంటే నేనే కాదు నా తెలుగు వారందరి బ్రతుకుల్లోనూ ఈ పద్యాలు అవినాభావ సంబంధంతో అల్లుకొనిపోయి వున్నాయి. తెలుగువారి నిత్యజీవితంలో తెలియకుండానే భాగవత భక్తి ఎంతగా ఇంకిపోయింది! భాగవత పద్యమంటే తెలుగు వాఁడు పరవశించిపోతాడే! ఆత్మీయమైన అనుభూతితో ఆలపించుకొంటాడే! ఆ పారవశ్యమేమిటి? ఆ అనుభూతి ఏమిటి?

రేపల్లెలో బాలకృష్ణుడు గోపికల యిళ్ళల్లో పాలూపెరుగూ బ్రతుకనిచ్చేవాడు కాడట! నవనీతచోరుడట! గోపికలందరూ యశోదమ్మ దగ్గరికి పరుగెత్తి బాలకృష్ణుడు చేసే గోలలన్నీ గొల్లున యేడుస్తూ మొరపెట్టుకున్నారట! మా అమ్మ ఈ పద్యం ఎందుకు చెప్పినట్లు? పాలూ, పెరుగూ, వెన్నా దండిగా గోరుముద్దల్లో మెసవి మెక్కించిన మా అమ్మ మాకేదో రుచిని ఆ పద్యంతో కలిపి మా కందించింది. అప్పుడేమో అమ్మపెట్టిన ముద్దల రుచి మనసులో మిగిలించి, పద్యం నాలుకమీద నిలచింది. ఇప్పుడా ముద్రలు జ్ఞాపకాలుగా మిగిలాయి. పద్యం గుండె గొంతుకలో క్రొత్తరుచుల నిస్తున్నది.

ఇప్పుడు పాలంటే పాలుకాదు; జీవితం. పెరుగంటే పెరుగుకాదు; జీవితంలో గడించిన అనుభవం. వెన్నంటే వెన్నకాదు జీవిత పరమార్థంగా భావించే దైవత్వం. వయసు వచ్చిన కొద్దీ పద్యం పద్యంగా లేదు. జీవిత సత్యంగా మారింది. ప్రతిభతో పరిశీలించిన కొద్దీ అందులోని ప్రతీకాత్మక ప్రవృత్తి ప్రతీయమానమౌతూ పరమార్థమేదో మనస్సుకు స్ఫురిస్తోంది. గోపికల యిళ్లలో ఉట్టిమీద పెట్టిన పాలపిడతలు, అందులో దాచబడిన వెన్న, మూకుళ్ల నెత్తి దొంగలిస్తున్న బాలకృష్ణుడు. కథ కళ్లముందు చిత్రంలా చిందులు త్రొక్కుతోంది. కాని, కథలో ఏదో మధురమైన సుధ ఆత్మవాసనా జిహ్వకు అవ్యక్తానుభవాన్ని అందిస్తుంది. గోపికలు భౌతికంగా గొల్లభామలైనా ఇప్పుడు మనకు వనితలుగా స్ఫురించరు, జీవాత్మలుగా దర్శనమిస్తారు. వారిళ్ళు దేహాలు. మూకుళ్లక్రింద పిడతలలో గుప్తంగా దాచబడిన వెన్న మనలో సహజంగా, సంగుప్తంగా ఉన్న దైవత్వం. పెరుగు ఆధ్యాత్మిక చింతనం, పాలు భక్తి భావనం. పాలనుండి పెరుగు, పెరుగులో నుండి వెన్న వస్తుందంటే ఈనాడు మనకు తెలిసిన సత్యం. మానవునికి భక్తివలన పారమార్థిక చింతన మేర్పడుతుందనీ, దానివల్ల ఆత్మజ్ఞానం లభిస్తుందనీ, అదే 'కైవల్యపదంబు చేరుటకునై చింతించే' విధానమనీ, ఏమీ

తెలియని పసితనంలో మన రక్తంలో జీర్ణమైంది భాగవత పద్యం; తెలిసీ తెలియని వయసుదనంలో దాని తాత్పర్యం తోచీతోచని వెలుగులా స్ఫురిస్తోంది. బహుశః ఆ లోవెలుగును పెంచుకొంటే పరమార్థం స్ఫురించవచ్చు.

శ్రీకృష్ణుడు అవతారపురుషుడు. అతడు లోకంలో విస్మృతమైపోతున్న ఆధ్యాత్మిక చింతననూ, దైవత్వాన్నీ అహంకారమనే మూకుళ్లను తొలగించి, అజ్ఞానమనే పిడతల్లో నుంచి బయటకు తీసి, ప్రజ్ఞానమనే నవనీతాన్ని లోకానికి పంచిపెడతాడు. మానవులు తమలోనున్న మహత్వాన్నే అవతార పురుషుడు చూపిస్తే చూచి అద్భుతపడి ఆమోదిస్తారు. దాచుకున్న దైవత్వాన్ని బయటకు తీసి ప్రదర్శిస్తే దొంగతనమని గోలపెట్టే అజ్ఞానులు అసలు సంగతి తెలియని అజ్ఞానులు. వాళ్లే గోపికలు, సృష్టికి తల్లియైన మాయతో చెప్పుకుంటారు అవతారపురుషుడు ఆగడం చేస్తున్నాడని. ఆగడమని అనుకుంటే ఆమె మాత్రం ఏం చేస్తుంది? అజ్ఞానాన్ని చూచి నవ్వుతుంది. ఆధ్యాత్మికమని తెలుసుకుంటే అవతార తత్త్వాన్నే ముందు పెడుతుంది. కొండాలు చెప్పే గోపికలకు గోపాలుడు దొరకడు; గొడవలే మిగులుతాయి. ఉన్న వెన్న పోవటమే కాకుండా ఉన్న ఊరువదలి పోవలసి వస్తుంది. ఉన్నవూరు వదలి పరాయి దేశాలకు పోతే ఉన్నది పోతుంది; ఉంచుకున్నది ఊడుతుంది. భాగవతం మన వూరు; మన యిల్లు. దాని తత్త్వం తెలియక పాశ్చాత్యభౌతిక వాదాల వెంటబడి వెళ్ళితే ఇహం లేకపోగా పరం కూడా దక్కదు. అమ్మ చెప్పిన కందపద్యం నాకందించే మాతృసందేశం ఇదే!

నాన్న నాకిచ్చిన ఆస్తి ఆయన చెప్పిన భాగవత పద్యం. ఆస్తికతను నా కందించిన అమూల్యమంత్రం. దేవుణ్ణి నమ్మి దేహాభిమానం వదులుకోమనీ, భూతదయను పెంచుకొని మానవునిగా మనుమనీ ఆ పద్యం చెపుతోంది. పరపీడన పరాయణత్వమే జీవిత లక్షణమని బోధించే భౌతిక వాదంలో సర్వమానవ సమానత్వం దర్శించలేని నేను భూతదయతో సమసమాజాన్ని సంభావింపగలుగుతున్నాను. ప్రతిజీవిలో ప్రతిబింబించే పరమాత్మను దర్శించి ఆరాధించటంలో ఆత్మార్పణం చేసికొన్నా ఆదర్శభక్తి ప్రపత్తిని ప్రసన్నం చేసికోగలుగుతున్నాను. మనిషి జంతువని లెక్కించే చూపుకన్న మనిషి మాధవుడని మన్నించే చూపు మహనీయమని భావిస్తున్నాను. నాన్న నాకు చెప్పింది భాగవత పద్యం కాదు, బ్రతుకులో సాటివాణ్ణి భగవంతునిగా చూచి సేవించే సేవాధర్మం; త్యాగశీలం!

బడిలో చదివిన ప్రార్థనాపద్యం పంతులుగారి భయానికి నేర్చుకున్నదే కావచ్చు. ఈనాడు ఎంత ఆలోచనను నాకు ప్రసాదిస్తోంది! భౌతికంగా ఎంత విజ్ఞానాన్ని పెంచుకొన్నా, ఎన్ని ప్రకృతి విజయాలను సాధించినా, మనిషి తనలోని తనను తెలిసికోలేని అసమర్థస్థితిలో ఉన్నాడు. ఈ సృష్టి చైతన్యంలోని మూలతత్త్వాన్ని తెలిసికోలేకపోతున్నాడు. నాగరికత నలుగడలా నిండుకొన్న ఈనాడు కూడా'ఎవ్వనిచే జనించు జగము' అన్న ప్రశ్న మిగిలే ఉండిపోయింది. యుగయుగాల అన్వేషణ సమాధానం కోసం సాగుతునే ఉంది. చిరంతనమైన ఈ చింతన నిత్యజీవితానుభవం. అడుగడుగున ఎదురౌతున్నా అంతుపట్టని ఆధ్యాత్మిక దర్శనం. ఎవరో చూచి ఎక్కడో వ్రాసి అచ్చొత్తించి పంచిపెట్టే ప్రచారసాహిత్యం కాదు. ప్రతివాడు లోచూపుతో తెలిసికోవలసిన ఆధ్యాత్మిక వాస్తవ సత్యం నిత్యసత్యాన్వేషణకు నిలువుటద్దం!

పౌరాణికుడు పూర్వవ్యవస్థలో సంస్కృతి ప్రబోధకుడు, ప్రచారకుడు, సమాజంలో దైవత్వాన్ని ప్రతిదినం పురాణప్రవచనం ద్వారా జాగృతం చేసే వృత్తి కళాకారుడు. ఆయన హరికీర్తనం చేయటంతో పాటు దయనూ, సత్యాన్నీ జీవితంలో పాటించు మని చెప్పాడు. ఆ రెండు గుణాలూ మనిషికి

నిండుగా ఉంటే ఆధునిక జీవితంలో నున్న అవినీతి అంతర్ధానమైపోతుందని నాకిప్పుడు తెలిసివచ్చింది. సమాజశీలాన్ని ప్రబోధించే ఆ పద్యం అందరి హృదయాల్లో ఋతంగా నిలువదగింది.

మా అక్క పాడే పద్యం గోపికాతత్త్వం; మధురభక్తికి మణిదీపం. భక్తికి స్థాయి భగవద్రూపరతి. రతిస్థాయి అయిన శృంగారం కంటే అది దివ్యం, సంపూర్ణం. కావ్యనాటకాలు చదువుకొన్న నాకు, మనందరికీ, నల దమయంతుల శృంగారం తెలుసు, శకుంతలా దుష్యంతుల ప్రణయం తెలుసు. అవన్నీ నవరసాల్లో ఒకటైన శృంగారాన్ని రసానుభూతికి అందించేవి. గోపికలు శ్రీకృష్ణుని పట్ల పచరించే రతి శృంగారరసం కంటే భిన్నమైంది. అందులో ఆధ్యాత్మికస్థితి ఉంది. లౌకికమైన రతి కామం, అలౌకికమైన రతి శృంగారం; అధ్యాత్మికమైన రతి భక్తి, గోపికలు శృంగార నాయికలు కారు; అభిసారికలసలే కారు. శ్రీకృష్ణరూపాన్ని సగుణబ్రహ్మంగా భావించి ఆత్మానుభవం కోసం ఆధ్యాత్మిక ప్రస్థానాన్ని సాగించే జీవాత్మ ప్రతీకలు. కావ్యాలలో రమణీయార్థ ప్రతిపాదకమైన వ్యంగ్య శక్తివలన రసం గమ్యమానమౌతుంది. భాగవతంలోని రమణీయార్థం ఆధ్యాత్మికార్థం. తద్భావభావనం వల్ల అలౌకికా ధ్యాత్మికానుభవ రూపమైన భక్తి ప్రతీయమానమౌతుంది. శృంగారాదులు శుద్ధ అలౌకికాలు, శాంతం శుద్ధ ఆధ్యాత్మికం; భక్తి లౌకికాధ్యాత్మిక మిశ్రరూపం. ఆ అనుభవం శృంగార శాంతాల కంటే భిన్నం; అభినవం. అది ప్రధానంగా భాగవతంలోని ప్రతీకాత్మక ప్రవృత్తి వలన అనుగమ్యమానమౌతుంది. యమునానది ఆత్మ చైతన్య స్రవంతి. పులినతలం పుణ్యావాసనల పుట్టినిల్లు. వెన్నెల వినిర్మల చిత్తపరీపాకం; గోపాలుడు సాకారమైన దైవత్వభావనం; వేణువు ఆధ్యాత్మిక భావప్రతీతి; గోపికలుజీవాత్మలు; వారి అన్వేషణం ఆముష్మికచింతనం; గోపాలగుణ రూపకీర్తనం భగవద్రూప రతిప్రసారం. గోపాలదర్శనం పరమార్థ దర్శనం. అతని సామీప్యం సాయుజ్య సంభావనం. అలౌకిక విభావమైన శ్రీకృష్ణుని ఆలంబనంగా చేసుకొని భగవద్రూపరతి సాగుతుంది; ఉత్కటావస్థను భజించినప్పుడు భక్తి రసస్థితిని తాలుస్తుంది. దీన్ని జీవితంలో పండించుకొనే ముగ్ధభక్తులూ, మధురభక్తులూ ఎందరో ఉన్నారు. సజీవ వ్యక్తులలోనే శ్రీకృష్ణభావనం చేసి లౌకిక భావాన్ని అలౌకికంగా పరిణమింప చేసికొంటారు వారు. వారిలోని ఆధ్యాత్మిక భావనమే ఆ రసస్థితి నందిస్తుంది. గోపికాగీతలు ఎందరికో జీవనగీతలు, భక్తిభావగీతలు, 'నల్లనివాడు' అన్న పద్యం తెలుగువారు నిత్య జీవితంలో పరమార్థాన్వేషణకు భక్తిప్రణవ మంత్రంగా ఉపాసించే అక్షరసూక్తం. పోతన్నగారు భాగవతంలో ప్రపంచించిన భక్తి మత్తచిత్తానికి సాహితీ సౌరభాన్నందించే ఉత్పలమాలిక! భక్తి రసానికి ఉజ్జ్వల దీపిక!

'మందార మకరంద' పద్యం భక్తుల మధురానుభవాన్ని లయబద్ధంగా ఆవిష్కరించిన సౌందర్యసృష్టి. లయబద్ధమైన సౌందర్య సృష్టియే కవిత. వాహిని భాగవత కవిత. అర్థం తెలిసినా, తెలియకపోయినా, అంతరమైన ఆధ్యాత్మిక చైతన్యాన్ని లయాత్మకంగా ఆవిష్కృతం చేయగలిగిన శక్తి ఆ పద్యానికి ఉంది. ఆ పద్యాన్ని రమించేవాడు రసికభక్తుడు; ఆ పద్యంలోని పరమార్థాన్ని భావింపగలిగినవాడు విద్వాంసుడు. భాగవతాన్ని తెలిసి పలకటం చిత్రమని పోతనగారన్నారు. భావాన్ని తెలియడమే చిత్రం; పరమార్థాన్ని తెలియడం చిత్రవిచిత్రం. ఎన్నిసార్లు ఆ పద్యాన్ని చదువుకొన్నా, విన్నా ఎంతో తెలిసినట్లు ఉండటం; ఇంకా తెలియవలసింది ఎంతో ఉన్నదని అనిపించటం ఆ పద్యంలోని చిత్రాతిచిత్రం!

భాగవతంలోని రుక్మిణీకల్యాణ ఘట్టం సాంసారిక ప్రణయానికి ఉపనిష ద్భాష్యం. భర్తలో భగవంతుణ్ణి చూచే ప్రణయతత్త్వం; భార్యలో శక్తిని దర్శించే జీవితసత్యం అందులో ప్రపంచింపబడింది. పార్వతీపరమేశ్వరులవలె భార్యాభర్త లుండాలనుకోవటం భారతీయ ప్రణయతత్త్వం. యద్భావం తద్భవతి. సతీపతులు భాగవతంలో సెక్స్ సింబల్సు కారు. శృంగార ప్రతీకలు కారు; భాగవతభక్తికి

ప్రణయాన్ని పూజాసుమంగా సంభావించే స్త్రీ పురుష ప్రవృత్తులు, జీవితంలో కామాన్ని ధర్మంగా మలచుకొని, ధర్మాన్ని దైవత్వసాధనకు మార్గంగా మార్చుకొని, ఇహపరాలను దంపతిభావంలో పండించుకొనే సవనకర్మ సాంసారిక జీవితం. పతితో కలిసి పరమార్థాన్ని సాధించడమే సతిశీల స్వభావం; సతితో కలిసి శక్తిమంతంగా పురుషార్థాలను సాధించటమే పతివీరధర్మం. పతి శక్తిరూపిణియైన సతిని సప్రయత్నంగా సాధిస్తాడు; సతిపరమార్థరూపుడైన పతిని ప్రణయభక్తితో పొందుతుంది. ఈ తత్త్వం రుక్మిణి కథ చెపుతుంది. తెలుగునాట కన్యలీఘట్టం పారాయణ చేస్తారు. పారాయణ పరమార్థాన్ని జీవితంలో సాధిస్తారు. భక్తితో బంధింపబడిన భార్యాభర్తల అనుబంధం రక్తికీ, ముక్తికీ సాధనం!

సాహిత్యోపాసకులకు భారతీసమారాధనం వాక్సిద్ధికి మూలం. వాక్కు శక్తిమంతం కావటానికి వాఙ్మయతత్త్వం తెలియాలి. వాక్కు ఉక్తిగా ఉన్మీలించటానికి సౌందర్యతత్త్వం తెలియాలి. ఉక్తిని భక్తిమయం చేయటానికి భగవత్తత్త్వం తెలియాలి. ఈ మూడు శక్తులను సాధిస్తే మన వాక్కుకు లౌకిక వృత్తినీ, కావ్యవృత్తినీ, ఆధ్యాత్మిక ప్రవృత్తినీ వ్యక్తీకరించే పటిమ ఏర్పడుతుంది. దానికోసమే నిత్యభారతీ సంస్మరణం?

జీవితంలో భౌతికమనీ, అధిభౌతికమనీ, ఆధ్యాత్మికమనీ మూడు అవస్థలు న్నాయి. ఈ మూడింటినీ సమన్వయించికొని వెలువడేదే సమగ్రసాహిత్యం. భాగవతం ఆ విధంగా జీవితావస్థల సమగ్రత్వాన్ని సాహితీ జగత్తులో వినిర్మించింది. భాగవత కవిత శాబ్దికంగా మనస్సును రమింపచేస్తుంది. ఆర్థికంగా ఆత్మను రసీకరిస్తుంది. శృంగారాది రసాలు హృదయానికి ప్రాతిభాసికానందస్థితిని కలిగించి ఊరుకుంటాయి. భక్తిరస ప్రధానమైన భాగవతం హృదయాన్ని ఆత్మతో ఆమ్రేడితం చేసి అద్వైతానందాన్ని అలౌకికాధ్యాత్మిక స్థితిలో అందిస్తుంది. ఆ అనుభూతిలో సహృదయుడు అంతరంగాన్నంతా ఆర్ద్రీకరించే ఒక సమగ్ర రసానందాన్ని అందుకుంటాడు. శృంగారాదులను చిత్రించే ప్రబంధాలు ఏ యుగంలోనైనా పుట్టవచ్చు; భక్తిని సమగ్రంగా ఆవిష్కరించే గ్రంథం సాహిత్య జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు గాని వెలువడదు. తెలుగువారి అదృష్టం వల్ల భాగవతం పోతన రచించాడు. అన్నీ పోయినా అదొక్కటుంటే చాలు మానవ జీవిత మహాప్రస్థానం మనుగడతో నిలుస్తుంది. భాగవత కర్తయైన పోతనను ప్రథమంగా ఎన్నికచేసి పంచశతి మహోత్సవం చేయటం తెలుగువారి ఔచిత్య దృష్టికి ప్రథమ తార్కాణం!

ఓరుగల్లు ఉత్సవాలకు రంగస్థలం కావటం మరో విశేషం. అది పురాణ సంగమ తీర్థం. ఆవేశ భక్తి ప్రధానమైన బసవపురాణం ఆ ప్రాంతంలోనే పుట్టింది; జ్ఞానప్రధానమైన మార్కండేయం అక్కడే అనువదింపబడింది; భక్త్యావేశాన్నీ పరమార్థతత్త్వాన్నీ సంవదించుకొన్న భాగవతరచనం కూడా అక్కడే సాగింది. సమగ్రభక్తి సాక్షాత్కారానికి సాహిత్యయోగం తపస్సుచేసి వాఙ్మయ ఫలాన్ని పొందిన విశిష్టక్షేత్రం ఏకశిలానగరం! బమ్మెరలో పోతన స్మారకచిహ్నం, ఓరుగల్లులో భాగవత గోష్ఠులు. భౌతిక జీవితంలోని వేదననంతా మోసుకొని వస్తున్న నేటి సాహిత్యం, ఆధ్యాత్మిక జీవితంలోని ఆనందతత్త్వాన్ని మధురంగా మననం చేసికోవలసిన అవసరమున్నదన్న సాహిత్యస్పృహను పోతనపంచశతి జయంతి జాతిలో జాగృతం చేయగలిగితే ఈ సంకల్పం సార్థకం కాగలదు.

పండుగలలో పరమాన్నాలకే ప్రాధాన్యం ఇచ్చే రోజులివి! పరమార్థం ప్రసన్నమౌతుందా? పారాయణం కాదు నేడు కావలసింది! ప్రచారంకాదు పోతనకు కావలసింది; భాగవతాన్ని నిజ జీవితంలో పండించుకోవటం నిజంగా పోతనకు మనమిచ్చే భక్తినీరాజనం!

*ఏప్రిల్ 1982*

 జి.వి. సుబ్రహ్మణ్యం

# సాహిత్య అకాడమీ రజతోత్సవం

ఆంధ్ర ప్రదేశ్ అకాడమీ ఆగస్టు 7వ నాటికి ఇరవై అయిదేళ్ళ జీవితం నిర్వహించి రజతోత్సవాలను చేసికొంటున్నది. చారిత్రకుల దృష్టిలో ఇరవై అయిదేళ్లు ఒక తరంగా లెక్కకు వస్తుంది. కాబట్టి ఆ సంస్థ తెలుగు భాషకూ, సాహిత్యానికీ, సంస్కృతి వికాసానికీ చేసిన సేవను ఆంధ్రులు అంచనా వేసికొని భావి కార్యక్రమాలను రూపొందించుకొనే తరుణం ఆసన్నమైనదని భావించటంలో విప్రతిపత్తి లేదు.

భారత ప్రభుత్వం భారతీయ భాషల వికాసానికి దోహదం చేసే కార్యక్రమంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగుభాషా సాహిత్యాలకూ, ఆంధ్ర ప్రదేశ్‌లోని భాషా సాహిత్యాలకూ సముచితమైన సేవ చేయాలని తలంచి రాష్ట్ర ప్రభుత్వం ఈ అకాడమీని ప్రప్రథమంగా మన రాష్ట్రంలో 1957లో నెలకొల్పింది. తెలుగుదేశంలోని సాహితీ వ్యక్తుల మధ్య పరస్పర సహకారాన్ని పెంపొందించి సారస్వతాభివృద్ధిని సాధించాలనీ, ఆధునికాంధ్ర భాషలోని మాండలికాలనూ, జానపద విజ్ఞానాన్ని సాహితీప్రక్రియలనూ అధ్యయనం చేసి, ఆధునిక సమగ్ర వ్యాకరణాన్నీ, నిఘంటువునూ నిర్మింపజేయాలనీ, ఉత్తమ రచనలకు, రచయితలకు బహుమతులనిచ్చి ప్రోత్సహించాలనీ, భాషా సాహిత్య పరిశోధనలకు ఇతోధికంగా వికాసాన్ని కలిగించాలనీ, ప్రజలలో సాహిత్యాధ్యయనాన్నీ, అనుశీలన ప్రవృత్తినీ పెంపొందింపజేయాలని సాహిత్య అకాడమీ ఆరంభింపబడింది.

ఆంధ్రప్రదేశ్‌లో విశ్వవిద్యాలయాలూ, సాహిత్య సంస్థలూ, ప్రచురణ వ్యవస్థలూ, పండితులూ, కవులూ, రచయితలూ అనవరతం ఆంధ్ర భాషాసాహిత్యాలకు ఎనలేని సేవచేస్తూ దేశ సేవ చేస్తూనే ఉన్నారు. అయినా, అన్నింటిమధ్యా ఒక సమన్వయం ఉండటం సర్వత్రా సాధ్యం కాదు. ఏయే అంశాలలో ఎంత వరకు కృషి జరిగిందనీ, జరగవలసిన అంశాలేవి మిగిలి ఉన్నాయనీ, ఏ విధంగా కృషి జరిగితే ఒక సమగ్రత సాధింపబడటానికి వీలుంటుందనీ వివేచించి, ఒక పర్యవేక్షక సంస్థగా, ఒక హితవరియైన వ్యవస్థగా సాహిత్య అకాడమీ నిలిచి తన కార్యక్రమాలను రూపొందిచుకొంటూ వచ్చింది. సమగ్ర నిఘంటు నిర్మాణం అకాడమీ చేపట్టదగిన బృహత్పథకం. రెండు మూడు దశాబ్దాలపాటు నిర్విరామ కృషి జరిగితేనే కాని ఒక నిర్దిష్టమైన ఫలితం కనపడని సుదీర్ఘ ప్రణాళిక. దానిని అకాడమీ చేపట్టి తన మొదటి కర్తవ్యాన్ని గుర్తించింది. కవుల పదకోశాలూ, మాండలిక పదకోశాలూ, శాసన శబ్దకోశాలూ, వృత్తిపదకోశాలూ, పదబంధ కోశాలూ, జాతీయాల సామెతల కోశాలూ మొదలైనవి చురుకుగా నిర్మించడానికి పూనుకొన్నది. కొన్నింటిని ప్రకటించింది. కొన్నింటికి తుదిరూపును దిద్దుతోంది. వీటివల్ల కొన్ని లక్షల పదాలు - ప్రజల నోళ్లల్లో సజీవంగా నివసిస్తున్నవి-నిఘంటువుల కెక్కే అవకాశం లభిస్తుంది. తెలుగుదేశంలోని మాండలిక పదాల స్వభావ పరిణామాలను చారిత్రకంగా గుర్తించే వెసులుబాటు కలుగుతుంది. భాషా పరిణామాన్ని శాస్త్రీయంగా చిత్రించటానికి వీలేర్పడుతుంది. భాషాపరంగా అకాడమీ చేస్తున్న ఈ కృతి భావితరాల వారికి ఒక వరం కాగలదు. ఇప్పటికే ఈ కోశాలను ఆధారంగా చేసికొని బహుశాఖల్లో పరిశోధనలు సాగుతూ ఉన్నాయి. అకాడమీ పదకోశ నిర్మాణ ప్రణాళిక భాషాధ్యయనంలో బంగారు పంటను పండిస్తున్నదనటంలో అనుమానం లేదు.

పాశ్చాత్య పండితులు తెలుగు భాషకు చేసిన సేవ విస్మరింపజాలనిది.వారిలో సి.పి. బ్రౌన్ ప్రాతఃస్మరణీయుడు. అతడు నిర్మించిన నిఘంటువులను అకాడమీ ప్రచురించింది. మెకంజీ కైఫియత్తులకు మేలిప్రతులను వ్రాయించి ప్రచురింప యత్నిస్తోంది. విద్యార్థుల కాధునిక

శాస్త్రాధ్యయనంలో కూడా తోడు పడేటట్లు నిఘంటువులను నిర్మిస్తోంది. తెలుగు అకాడమీ తెలుగులో విద్యాబోధన కనువైన పరికర గ్రంథాలను సంతరిస్తుంటే సాహిత్య అకాడమీ ఆధునిక సాహిత్య పరిశోధన కనువైన గ్రంథాలను రూపొందింప సమకట్టటం ముదావహమైన అంశం. చర్వితచర్వణం కాని సబబైన చర్య.

తెలుగులో వెలసిన గ్రంథాలలో సాహిత్య శిఖరాలుగా నిలిచినవి ఆంధ్ర మహాభారతం, ఆంధ్ర మహాభాగవతం. ఆంధ్ర మహాభారత సంశోధిత గ్రంథ నిర్మాణాన్నీ, ప్రచురణాన్నీ ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి తెలుగు శాఖ సాధించింది. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆంధ్రభాగవత సంశోధిత ప్రతిని తయారు చేయించి ప్రచురించింది. సాహిత్య పరిశోధకులకివి రెండూ ప్రామాణికమైన ఆధారగ్రంథాలుగా ఉపకరిస్తున్నాయి.

ప్రాచీన కావ్యాలు నేటి తరానికి అందుబాటులో లేవు. వాటిని ప్రచురించే సంస్థలు క్రమంగా అంతర్ధానమొందసాగాయి. ఆ తరుణంలో అకాడమీ ప్రాచీన కావ్యాలనూ, గ్రంథాలనూ పరిష్కరింపచేసి, పునర్ముద్రించి సరసమైన ధరలకు సాహితీలోకానికి అందించటానికి చేపట్టింది. ఆ వరుసలో ఆంధ్ర మహాభారతం కూడా ప్రచురితమైంది. ఈ కార్యక్రమం ద్వారా విలువైన ప్రాచీన కావ్యాలు విలువైన పీఠికలతో తెలుగువారి అందుబాటులోకి వచ్చాయి, వస్తున్నాయి.

సంస్కృతం, హిందీ, ఉర్దూ మొదలైన భాషల్లో కూడా కొన్ని గ్రంథాలను ప్రకటించడమేకాక, వాటిలో నుండి తెలుగులోకీ, తెలుగులోనుండి వాటిలోకీ అనువాదాలను చేయించి ఆ గ్రంథాలను కూడా అకాడమీ ప్రచురిస్తోంది. మహిళా శాఖను ప్రత్యేకంగా ప్రారంభించి; సభలూ, సమావేశాలూ, గోష్ఠులూ నిర్వహించటమే కాక, వారి రచనలను కూడా ప్రచురిస్తోంది. తెలుగు వైతాళికులనే పతాక క్రింద గత శతాబ్దిలో తెలుగు సాహిత్యానికి ఎనలేని కృషి చేసిన సాహితీమూర్తుల ప్రతిభావైదుష్యాలను తెలియజెప్పే ఉపన్యాస కార్యక్రమాలను దేశంలోని వివిధ కేంద్రాలలో నిర్వహించి, ఆ ఉపన్యాసాలను సంపుటులుగా ప్రచురిస్తోంది.

సమకాలీన సాహిత్య రంగంలో కృషి చేస్తున్న రచయితలను ప్రోత్సహించటానికీ, నిర్దిష్టమైన సాహిత్యాంశాల మీద ఉత్తమ గ్రంథాలను రచింపించి ప్రచురింప చేయటానికీ అకాడమీ మరికొన్ని కార్యక్రమాలను చేపట్టింది. వాటిలో ముఖ్యమైనవి; ప్రతి సంవత్సరం రెండంశాలమీద పోటీ రచనల నాహ్వానించి ఉత్తమ రచనకు రూ. 3,500ల బహుమతి నందజేయటం. కవిత, సాహిత్య విమర్శ, నవల, కథ, నాటకం/నాటిక మొదలైన ప్రక్రియల్లో ఉత్తమ రచనలకు ప్రతి యేటా రూ. 2,500ల బహుమతుల నివ్వటం, ఉత్తమ రచయిత్రి రచనకు బహుమతి నివ్వటం, ఉత్తమ బాలసాహిత్య రచనకు బహుమతి నివ్వటం వంటి కార్యక్రమాలు సాగిస్తున్నది. సొంతంగా గ్రంథాలను ప్రచురించుకోదలచుకొన్ని రచయితలకు ధన సహాయం చేయటం, ఋణాలను మంజూరు చేయటం లాంటి సహాయక కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. రాష్ట్రంలోనూ, రాష్ట్రేతర ప్రాంతాలలోనూ సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తున్న స్వచ్ఛంద సాహితీ సంస్థలకు యథోచితంగా సహాయ నిధుల నందచేస్తున్నది.

ఇంతవరకు సాధించింది ఒక యెత్తు, ఇకముందు సాధింపవలసింది మరో యెత్తు. భవిష్యత్తును నిర్మాణాత్మక కార్యక్రమాలతో ఉజ్జ్వలం చేసికొని దేశంలోని సాహితీసమారాధకుల నధికంగా తన కార్యక్రమాల్లో పాలుపంచుకొనేటట్లుగా అకాడమీ పథకాలను రూపొందించుకొని స్వర్ణోత్సవాన్ని జరుపుకొని ముందుకు నడవాలని ఆశిద్దాం! వెండి పండుగ జరుపుకుంటున్నందుకు అభినందన లందజేద్దాం!



## ఆంధ్ర జనతకు, నవతకు
## యువతకు అంకితమ్ము

చిమ్మచీకట్లను చీదరించుట కంటె
చిరుదివ్వె వెలిగించు శిల్ప మెరిగి
సామాన్య జనులలో సాహిత్య చైతన్య
సందీప్తి పోషించు సభలు తీర్చి
కమనీయ కావ్యాల కవితా కళా శిల్ప
వైభవాల్ వివరించు ప్రభలు చిమ్మి
మానవ మూల్యాల మహనీయ సంస్కృతి
నిర్మాణ శిక్షణ నీతి నెరపి

భారతీపాద మంజీర భవ్యరవము
తెలుగు వారల గుండెలో వెలుగునట్లు
చెలగు యువభారతీ సంస్థ జీవితమ్ము
ఆంధ్ర జనతకు నవతకు అంకితమ్ము !
ఆంధ్ర జనతకు యువతకు అంకితమ్ము !!

– ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం